



ఓం





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# చందమామ కథలు







# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చందమామ కథలు

మాచిరాజు కామేశ్వర రావు



# చందమామ కథలు



మాచిరాజు కామేశ్వర రావు





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# ఇందులో...

# * విధి నిర్వహణ *



రామశాస్త్రి నగరంలో పేరున్న వైద్యుడు. ఆ నగరం ఒక నది ఒడ్డున ఉన్నది. నదికి పుష్కరాలు వచ్చిన సందర్భంగా ఒక సాయంకాలం రామశాస్త్రి చిన్ననాటి స్నేహితులు శ్రీహరి, విఠలూ, ఆయన ఇంటికి వచ్చారు. శ్రీహరి బడి నడిపే పంతులు. విఠలు ఒక చిన్నగ్రామంలో న్యాయాధికారి.

రామశాస్త్రి తన మిత్రులను ఊళ్ళో ఉన్న దేవాలయాలన్నిటికీ తిప్పి చీకటి పడే వేళకు ఇంటికి తెచ్చి, తన స్నేహితులకు కూడా వంట చెయ్యమని తన భార్యకు చెప్పి, ముందు గదిలోకి వచ్చి కూర్చుని, తన స్నేహితులతో కబుర్లు చెప్పసాగాడు. అతను తన విధిని నిర్వహించటంలో

ఒక్కసారి అక్రమంగా ప్రవర్తించిన మాట తన స్నేహితులతో ఈ విధంగా చెప్పాడు :

ఆ ఊళ్ళో ఒక గొప్ప ధనికుడు నెల నెలా విందుచేసి, దానికి గొప్పవాళ్ళను మాత్రమే ఆహ్వానించేవాడు. ఒకసారి రామశాస్త్రికి కూడా ఆహ్వానం వచ్చింది. ఊళ్ళోని గొప్పవాళ్ళ చిట్టాలో తన పేరు కూడా ఎక్కింది గదా అనీ, ఊరి పెద్దల పరిచయం చేసుకుని తాను తన వృత్తిలో బాగా పైకి రావచ్చుననీ రామశాస్త్రి ఎంతో సంతోషించాడు.

అతను ఉన్నంతలో మంచి బట్టలు కట్టుకుని, విందుకు బయలుదేరబోతూండగా ఒక పేదరాలు గోలగా ఏడుస్తూ రామశాస్త్రి కాళ్ళమీద పడి, "నా మొగుడి ప్రాణం నువ్వే కాపాడాలి. పదిమంది సంతానానికి దిక్కు అయిన వాడు అకస్మాత్తుగా విరుచుకుపడి పోయాడు," అని కళ్ళనీళ్ళతో దీనంగా వేడుకున్నది.

రామశాస్త్రి మనసు విందుమీద ఉన్నది. అదీగాక ఈ పేదరాలి మొగుడికి వైద్యం చేసినందువల్ల తనకేమీ లాభం ఉండదు. అందుకని అతను, "తొందర పనిమీద వెళుతున్నాను". అని వెళ్ళిపోయాడు. అయితే ఏదో అవాంతరం వచ్చి ఆరోజు ఆ విందు వాయిదా పడింది. రామశాస్త్రి ఇంటికి తిరిగివచ్చి, ఆ పేదరాలి ఇల్లు కనుక్కుని వెళ్ళేసరికి అంతా మించి పోయింది. సమయానికి చికిత్స జరగక ఆమె భర్త చనిపోయాడు.

"ఈ ఒక్క సందర్భంలో తప్పిస్తే నేను నా విధి నిర్వహణలో మరెన్నడూ పొరపాటు చెయ్యలేదు". అన్నాడు రామశాస్త్రి.

"నీలాగే నేను కూడా ఒక్కసారి నాధర్మాన్ని అతిక్రమించాను." అంటూ బడిపంతులు శ్రీహరి ఇలా చెప్పాడు.

అతను పనిచేసేది జమీందారుగారి బడిలో. అందులో జమీందారుగారి అబ్బాయి చదువుకునే వాడు. అయినా అది తమ బడే గనక చదువు విషయంలో అశ్రద్ధ చేస్తూ కూడా విద్యార్థులలో మొదటివాడుగా ఉండేవాడు. ఆ బడిలో ఒక రైతు కొడుకు చేరాడు. వాడు చాలా చురుకైనవాడు. ప్రతి విషయంలో వాడు జమీందారుగారి అబ్బాయిని మించి ఉండేవాడు.

అందుచేత జమీందారుగారి అబ్బాయి ఆ రైతు కొడుకును బడినుంచి పంపెయ్యమని శ్రీహరిని కోరాడు. వాడు చెప్పినట్లు చెయ్యకపోతే తన ఉద్యోగం ఎక్కడ ఊడుతుందోనని, శ్రీహరి ఆ రైతు కొడుకును, చెప్పని పాఠాలలో ప్రశ్నలు వేసి, ఆ పాఠాలు ఇంకా చెప్పలేదన్నందుకు వాడి మీద ఇంత ఎత్తు లేచి, వాణ్ణి ఒకనాడు బడినుంచి వెళ్ళగొట్టాడు.

రైతుకు తన కొడుక్కు జరిగిన అన్యాయం గురించి తెలుసు. అయినా అతను జమీందారుకు భయపడి, మెదలకుండా వూరుకున్నాడు. ఆ విధంగా చదువుకుని ఎంతో పైకి రావలసిన రైతు కొడుకు, తండ్రితోపాటు పొలం పనులు చేసుకోవలసి వచ్చింది.

“మీలాగే నేను కూడా ఒక్కసారి నా విధిని నిర్వర్తించలేక పోయాను.” అంటూ న్యాయాధికారి విఠలు ఇలా చెప్పాడు:

ఒకసారి అతని దగ్గరికి ఒక వివాదం వచ్చింది. ఒక పెద్ద వ్యాపారి తన జాగాలో పెద్ద భవంతి కట్టుకున్నాడు. అతని స్థలాన్ని ఆనుకునే ఒక కాపు స్థలమూ, గుడిసే ఉన్నాయి. ఎంతగా అడిగినా కాపు ఆ స్థలాన్ని వ్యాపారికి అమ్మలేదు. వ్యాపారి తన మనుషులచేత కాపువాడి గుడిసె కూలదోయించి, స్థలం ఆక్రమించుకున్నాడు.

నిజం విఠలుకు తెలుసు. కాని అతని చెల్లెలిని వ్యాపారి కొడుక్కు ఇచ్చి పెళ్ళి చేసేటందుకు మాటలు జరుగుతున్నాయి. వ్యాపారి బోలెడు పలుకుబడి కలవాడు. అందుచేత విఠలు వ్యాపారికి అనుకూలంగా తీర్పు చెప్పాడు.

“ఇది ఒక్కటే నేను నావృత్తిలో చేసిన అక్రమం” అన్నాడు విఠలు.

“మొత్తం మీద మనమంతా మన విధులను సక్రమంగా నెరవేర్చుతున్నట్టే! ఇంక భోజనాలకు లేద్దాం,” అంటూ రామశాస్త్రి వంట ఇంట్లోకి అడుగుపెట్టి నిర్ఘాంతపోయాడు. అతని భార్య వంటచేసే ప్రయత్నంలో లేదు. తలుపు పక్కనే కూర్చుని, ముందు గదిలో జరిగిన సంభాషణ వింటున్నది.

“ఇదేమిటే, ఇలా కూర్చున్నావు? వంట చెయ్యలేదూ?” అని రామశాస్త్రి అడిగాడు.

“లేదు. ఈపూట నాకు ఒళ్ళు నొప్పులుగా ఉన్నది,” అన్నదామె.

రామశాస్త్రికి ఒళ్ళు మండిపోయింది. ఆ సమయానికి పూటకూళ్ళ ఇల్లుకూడా కట్టేసి ఉంటారు. రాకరాక వచ్చిన తన స్నేహితులు పస్తుపడుకోవాలా? అతనిక్కూడా ఆకలి దహించుకుపోతున్నది.

ఆ కోపంతోనూ, ఆకలితోనూ అతను తన భార్య మీద చెయ్యి చేసుకోబోయాడు.

“ఆగండి. నేను ఒక్కసారి నా విధి నిర్వర్తించనందుకే నన్ను కొట్టవచ్చారు ఏం మునిగిపోయిందని? ఒక పూట తిండిలేకపోతే ఎవరమూ చచ్చిపోం. వైద్యుడు తన విధి నిర్వర్తించకపోతే నిండు ప్రాణం పోతుంది. గురువు విద్యార్థి పట్ల అక్రమంగా ప్రవర్తిస్తే వాడి జీవితం భ్రష్టు అయిపోతుంది. న్యాయాధికారి అక్రమంగా ప్రవర్తిస్తే ఒక మనిషి అనవసరంగా శిక్షకు గురి అవుతాడు. ఈ వృత్తులను చేసేవాళ్ళు ఒక్కసారి తమ విధి నిర్వహణలో పొరపాటు చేసినా క్షమించరాదు. ముందు మీ ముగ్గురూ ఈ విషయం తెలుసుకోవాలి. మీరు బయటికి వెళ్ళినప్పుడే వంట చేసేశాను. కాళ్లు కడుక్కొని రండి, వడ్డిం చేస్తాను,” అన్నది రామశాస్త్రి భార్య.

# * కొడుకు బాధ్యత *



పార్వతమ్మ అనే ముసలావిడ, వీధుల వెంట తిరిగి బిచ్చమెత్తి బతికేరోజుల్లో, ఆరేళ్ళ అనాధ బాలుడుగా అనంతుడు ఆమెకు దొరికాడు. వాడికి చదువు మీద వున్న ఆసక్తి గమనించిన పార్వతమ్మ తాను బిచ్చమెత్తి సంపాయించిన డబ్బులో కొంత మిగిలిస్తూ, వాడికి చదువు చెప్పించింది.

అనంతుడు ఇరవైఏళ్లవాడై చదువు పూర్తిచేసి ఉద్యోగం సంపాయించుకున్నాడు. ఆ తర్వాత ఒక మంచి ఇల్లు అద్దెకు తీసుకుని, అందులో ప్రవేశించాడు. పార్వతమ్మ ఇక తన కష్టాలు తీరిపోయినట్టు, చాలా ఆనందపడింది.

ఆ పరిస్థితుల్లో, తమ పిల్లనిస్తామంటూ కొందరు ఆడపిల్లల తండ్రులు అతడి ఇంటికి రాసాగారు. అలా వచ్చిన సంబంధాల్లో, తనకూ, తనను పెంచి పెద్దచేసిన అవ్వ పార్వతమ్మకూ నచ్చిన ఒక అమ్మాయిని అనంతుడు పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరు అమల.

అమలకు తను కాపురానికి వచ్చిన రోజునుంచీ, భర్తతోపాటు ఒకనాటి బిచ్చగత్తెకు వండి వడ్డించడం చెప్పలేనంత కంపరంగా వుండేది. భర్త ఇంటలేనప్పుడు ఆమె పార్వతమ్మను చీదరించుకుంటూ సూటీ పోటీ మాటలు అనేది. అయినా, ఇలాంటివాటికి ఎంతో కాలంగా అలవాటు పడిపోయిన పార్వతమ్మ అంతగా బాధపడేది కాదు.

ఈ పరిస్థితుల్లో వృద్ధాప్యానికి తోడు ఆమె అనారోగ్యానికి గురి అయింది. అనంతుడికి ఆమెను గురించిన చింత పట్టుకున్నది. ఆమె వద్దంటున్నా వినక వైద్యం కోసం డబ్బు ఖర్చుచేయసాగాడు. అమలకు ఇదేమాత్రం యిష్టంలేదు.

ఒకనాడామె భర్తతో "పండగ ఇంకా వారం రోజులే వున్నది. మీరు, నాకు పట్టుచీర కొనిపెట్టి చాలా కాలమైంది. పండగకు ఒక పట్టుచీర కొనండి" అన్నది.

అనంతుడు కొంచెంసేపాలోచించి, "పండగలకేం, దీని తర్వాత మరొక పండగ రాకపోదు. నువ్వు చూస్తున్నావు గదా – అవ్వ వైద్యానికి చాలా ఖర్చు పెట్టవలసివస్తున్నది." అన్నాడు.

ఆ జవాబు వింటూనే, అమల ఎక్కడ లేని కోపం తెచ్చుకుని, "ఒక బిచ్చకత్తె కోసం అంత డబ్బు ఖర్చు పెట్టడం, బుద్ధిమంతులు చేసే పనేనా?" అని అడిగింది.

అనంతుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, "అవ్వను గురించి అంత చులకనగా, మరెన్నడూ మాట్లాడకు!" అని బయటికి వెళ్ళిపోయాడు.

దానితో అమలకు పార్వతమ్మ పట్ల ద్వేషం రెట్టింపయింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక ఆమె భర్తతో, "నేను పగలంతా ఎంత క్షోభపడిపోయానో, మీకు తెలియదు. మీరు బాగా ఆలోచించి, నేను కావాలో లేక, ఆ బిచ్చగత్తె కావాలో తేల్చుకోండి!" అన్నది.

ఆ మాటలకు అనంతడు ఆవేశపడిపోతూ, "బిచ్చగత్తె అనవద్దని లోగడ చెప్పాను. నీది వట్టి కుళ్ళుబుద్ధి. భర్తగా నిన్ను సంతోషపెట్టవలసిన బాధ్యత నాకు తెలుసు. అయితే, అనాధనైన నన్ను పెంచి పెద్ద చేసిన అవ్వ పట్ల, నాకు బాధ్యతంటూ లేదా? ఇంతటితో నోరు మూసుకో" అన్నాడు.

అమల ఆనాటి తెల్లవారుజామున, తను వెళ్ళిపోతున్నట్టు ఒక ఉత్తరం రాసి, నిద్రపోతున్న భర్త తలదిండు కిందపెట్టి, బాడుగబండిలో పుట్టింటికి వెళ్ళిపోయింది.

హఠాత్తుగా వచ్చిన అమలను చూసి ఆమె తండ్రి "ఇలా ఒక్కదానివే వచ్చావేం?" అని అడిగాడు.

ఆమె జరిగినదంతా తండ్రికి చెప్పి, "నాకన్నా ఆయనకు, ఆ ముసలి బిచ్చగత్తె ఎక్కువట.

ఆ ఇంట్లో ఒక్క క్షణం కూడా వుండలేక వచ్చేశాను" అన్నది.

ఆమె తండ్రి కొంచెం సేపు తలాడిస్తూ వూరుకుని "మంచి పని చేశావు. భార్య పట్ల తన బాధ్యత ఏమిటో గ్రహించిన నాడు అతనే వస్తాడు" అన్నాడు.

తండ్రి మాటలు విని అమల చాలా సంతోషించింది. అయితే, ఆమె అన్న మాత్రం పలకరించనైనా పలకరించకుండా బయటికి వెళ్ళిపోవడం, ఆమెకు చాలా బాధకలిగించింది.

తర్వాత కొంతసేపటికి ఆమె తండ్రి కచేరీకి వెళుతూ, "జరిగిందేదో జరిగి పోయింది! నేను చీకటి పడకుండా వచ్చేస్తాను" అన్నాడు.

అయితే, ఆ రోజు బాగా చీకటి పడిపోయాక కూడా తండ్రి ఇంటికి రాకపోవడంతో, అమల ఆదుర్దాపడి తండ్రితో పాటు కచేరీలో ఉద్యోగం చేసే ఎదురింటి రామయ్య దగ్గిరకు వెళ్ళి, "ఏం, బాబాయ్! మా నాన్న ఇంకా రాలేదేం?" అని అడిగింది.

"నీకు చెప్పడానికి మనస్కరించక వూరుకున్నాను. ఈ సాయంత్రం మీ నాన్న లంచం పుచ్చుకుంటూ దొరికి పోయాడు. నిలవడం కష్టం – ఉద్యోగం పోయినట్టే!" అని చెప్పాడు రామయ్య.

ఈ వార్త విని అమల నిలువెల్లా వణికిపోయింది. లంచం కారణంగా ఉద్యోగం పోవడం అంటే, దానితోపాటు పరువూ పోయినట్టే! అమల ఇలా ఆలోచిస్తూ, ఇంటికి తిరిగి వచ్చేసరికి పెరట్లో ఏదో అలికిడైంది. ఆమె అక్కడికి వెళ్ళేసరికి, తండ్రి నూతి పళ్ళెం మీద ఏదో కాయితం పెట్టి వెళ్ళిపోతున్నాడు. అమల గబగబా పోయి అతడి చేయి పట్టుకున్నది.

"ఇక ఎవరికీ, నా ముఖం చూపెట్టలేను, తల్లీ! నా దారిన నన్ను పోనీ," అన్నాడు అమల తండ్రి.

"అదేం మాట నాన్నా! లోపలికి రా" అన్నది అమల. వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ఈ వయసులో ఉద్యోగం పోయిన నా బతుకు ఎలా గడుస్తుంది." అన్నాడామె తండ్రి బాధగా.

"దిగులుపడకు, నాన్నా! నీ ఉద్యోగం పోయినా, అన్నయ్య ఉద్యోగం ఉన్నది. కొడుకుగా నిన్ను పోషించవలసిన బాధ్యత అన్నయ్యకు లేదా?" అన్నది అమల.

ఆ సమయంలో పెరటి తలుపు తెరిచి అక్కడికి వచ్చిన అమల అన్నయ్య ఆమెతో "ఆ బాధ్యత విషయం తర్వాత చెబుతాను ముందు ఈ సంగతి చెప్పు. అమలా! కాళ్ళూ, చేతులూ బావుండి, గౌరవనీయమైన ఉద్యోగం చేసుకుంటున్న నాన్న, లంచం తీసుకోవడం, నీకు అసహ్యం కలిగించడంలేదా?" అన్నాడు.

"దైవసాక్షిగా, నాన్న మీద అలాంటి అసహ్యభావం నాకు ఏమాత్రం లేదు" అన్నది అమల.

ఆ జవాబుకు ఆమె అన్న నవ్వి, "లంచం తీసుకోవడంలాంటి, అతి నీచమైన పని చేసిన నాన్న అంటే, నీకు అసహ్యం కలగడం లేదు. కాని, అంగవైకల్యం వల్ల, మరో దారిలేక

బిచ్చగత్తెగా మారిన పార్వతమ్మ అంటే, నీకు అసహ్యం! ఎటువంటి నేరం చేసినవాడైనా, తండ్రి గనక పోషించవలసిన బాధ్యత కొడుకుగా నాకున్నదన్నావు," అన్నాడు.

"అవును, లేదా మరి?" అని అడిగింది అమల కోపంగా.

"ఆ బాధ్యత నాకున్నదన్న సంగతి నువ్వు చెప్పనవసరం లేదు. అనాధ అయిన తనను, ఎన్నో శ్రమలకోర్చి పెంచి పెద్ద చేసిన పార్వతమ్మను, ఆమె ముసలితనంలో పోషించవలసిన బాధ్యత అనంతుడికి లేదా? ఆ ఇంటి కోడలుగా ఆమెను గౌరవిస్తూ, సేవలు చేయడం నీకు ధర్మంకాదా? " అని అడిగాడు అమల అన్న.

అమల జవాబేమీ చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టుకుని, "అన్నయ్యా నువ్వు నా కళ్లు తెరిపించావు. పొద్దున్నే బయలుదేరి అత్తగారింటికి వెళతాను. నాన్నకు ఉద్యోగం పోతే పోయింది ఏదైనా శిక్ష కూడా పడుతుందేమో అని, నాకు భయంగా వున్నది" అన్నది.

ఆ మాటలకు అమల తండ్రి చిన్నగా నవ్వి, "నేను లంచమూ తీసుకోలేదు, ఉద్యోగమూ పోలేదు. నీ మేలు కోరి – నీకు బుద్ధి గరపడానికి రామయ్యా, నేనూ, నీ అన్నయ్యా, ఈ చిన్న నాటకం ఆడాం" అన్నాడు.

"మీరాడిన నాటకం నాకీ జన్మకు సరిపడా బుద్ధినీ, మంచి చెడ్డలు ఆలోచించగల జ్ఞానాన్నీ ప్రసాదించింది!" అంటూ అమల సంతోషంగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

# * గొప్పమనసు *



రాయవరం చిన్న గ్రామం. దాన్ని ఆనుకుని ప్రవహిస్తున్న నదికి పుష్కరాలు వచ్చాయి. వారం రోజుల నుంచి జనం ఎక్కడి నుంచో తండోపతండాలుగా వచ్చి, నదిలో స్నానం చేసి వెళుతున్నారు. వారం పది రోజులపాటు గ్రామస్థులకు ఇదొక పెద్ద పండగ.

ఆ సమయంలోనే, గ్రామంలోని చిన్న రైతు దశరథయ్య కూతురు సుమతి పుట్టిన రోజు పండుగ వచ్చింది. అతడి భార్య భర్తను వేగిరపెడుతూ, "చీకటి పడకుండా వచ్చేయండి. దర్జీ యీ సరికే అమ్మాయి పట్టు పరికిణీ కుట్టే వుంటాడు. అమ్మాయిని గుడికి తీసుకుపోవాలి. అసలే ఊరినిండా జనం!" అని హెచ్చరించింది.

అయితే, దశరథయ్య దర్జీ దగ్గిరకు వెళ్ళేసరికి, యింకా పరికిణీ పని పూర్తికాలేదు. దర్జీ అతణ్ణి కొంచెంసేపు కూర్చోబెట్టి పని పూర్తిచేశాడు. అతడు పరికిణీ తీసుకుని బయలుదేరేసరికి చీకటి పడుతున్నది.

దశరథయ్య ఇంటిని సమీపిస్తుండగా ఒక పాతికేళ్ళ కుర్రాడు పెరటి ద్వారం నుంచి కంగారుగా బయటికి వస్తున్నాడు. దశరథయ్య అతణ్ణి, ఏనాడూ చూసి వుండలేదు.

ఆ కుర్రాడి బెదురు చూపులూ, కంగారు చూస్తూనే, దశరథయ్యకు వాడు దొంగ అన్న అనుమానం కలిగింది. అతడు పరుగునపోయి, వాడి మెడ పుచ్చుకుని, "నువ్వెవరు? ఇంట్లోంచి ఏం దొంగిలించావు?" అన్నాడు కరుకుగా.

కుర్రాడు బాగా బెదిరిపోయి మాటలు రాక కాస్త తడబడ్డాడు. దశరథయ్య వెంటనే వాడి వీపు మీద చేత్తో గట్టిగా చరిచి, "దొంగవెధవా, నిజం చెప్పు. దంగిలించిన వస్తువెక్కడ?" అంటూ పెద్దగా అరిచాడు.

అది విని, అతడి భార్యా, కూతురే కాక పక్క ఇళ్ళవాళ్ళు కూడా అక్కడికి వచ్చారు.

"ఈ వయసులో కష్టపడి పనిచేసుకోక, దొంగతనాలకు దిగాడన్న మాట! నాలుగు తన్ని బుద్ధి చెప్పండి." అన్నాడొకడు అక్కడ చేరిన గుంపులో నుంచి.

"ముందు ఏం కాజేశాడో చూడండి." అన్నాడు మరొకడు.

దశరథయ్య వాడి దుస్తులు తడిమి చూశాడు. జేబులో కొంత చిల్లరడబ్బు తప్ప మరేం లేదు.

ఆ కుర్రాడు చేతులు జోడించి "నేను దొంగను కాదు. నన్ను వదిలిపెట్టండి" అన్నాడు.

"ఈ మధ్య ఎవరో పిల్లల్ని ఎత్తుకుపోతున్నారట. పుష్కరాలు గనక తేలిగ్గా పిల్లల్ని ఎత్తుకుపోవచ్చని వచ్చి వుంటాడు!" అన్నదొకావిడ.

గుంపులోంచి ఇద్దరు ముందుకు తోసుకువచ్చి, కుర్రవాణ్ని కొట్టబోయేంతలో వాడు "అయ్యా, ఆగండి! ఇంట్లో దేవుడి మందిరం పక్కన వున్న ఎర్రసంచీ ముందు తీసుకురండి" అన్నాడు నిదానంగా.

సుమతి గబగబా ఇంట్లోకి పరిగెత్తి ఎర్ర సంచీ తీసుకువచ్చింది. దాని నిండా గలగలలాడుతూ వెండి నాణాలున్నవి. దశరథయ్యకు ఆ సంచీ తన ఇంట్లోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు.

కుర్రాడు గొంతు సవరించుకుని, "ఆ సంచీలో వెయ్యి వెండి కాసులున్నవి. ఆ సంచీని మీయింట్లో పెట్టింది, నేనే! ఎందుకు పెట్టానో చెప్పమంటారా?" అన్నాడు.

దశరథయ్యతోపాటు, అక్కడ చేరిన వాళ్ళందరూ ఆశ్చర్యపోతూ కుర్రాడి కేసి చూశారు. వాడు జరిగిన సంగతి యిలా చెప్పాడు:

పన్నెండు సంవత్సరాల క్రితం వాడికి బాగా జబ్బుచేసింది. వైద్యులు వాడి తండ్రితో పట్నం తీసుకుపోయి మంచి వైద్యం చేయిస్తేనే గాని, పిల్లవాడు బతకడని చెప్పారు. అయితే తండ్రి చేతిలో అవసరానికి తగిన డబ్బు లేదు. పొరుగూరిలో అతడి చిన్ననాటి స్నేహితుడొకడున్నాడు. అతడు తప్పక సాయం చేయగలడన్న ఆశతో ఆయన ఆ ఊరు వెళ్ళాడు.

అయితే, ఆ స్నేహితుడు పుష్కరాల స్నానం కోసం, ఈ ఊరు వచ్చినట్టు తెలిసింది. కుర్రవాడి తండ్రి అక్కడి నుంచి అతడికోసం, ఈ ఊరు వచ్చాడు. కాని, సాయంకాలం వరకూ తిరిగినా, అంతమంది తీర్థప్రజల్లో, ఆయనకు తన స్నేహితుడు కనిపించలేదు.

ఇక చేసేదిలేక తన గ్రామానికి బయలుదేరుతూ, దాహం తీర్చుకునేందుకు, ఊరి రచ్చబండకు ఎదురుగా వున్న, మండువా ఇంటికి వెళ్ళి, తలుపు తట్టాడు. ఇంటావిడ తలుపు తెరిచి, అతడికి మంచి నీళ్ళిచ్చి, తిరిగి తలుపు మూసింది.

కుర్రాడి తండ్రి తిరిగి వీధిలోకి రాబోయే సమయంలో, గడప దగ్గిర విలువైనరాయి తాపడం చేసిన ఉంగరం ఒకటి, తళుక్కుమంటూ అతడి కంట బడింది. అతడు దాన్ని తీసుకుని చూసి, తలుపు తట్టి, ఇంటి వాళ్ళకు యిద్దామనుకున్నాడు. కాని, చప్పున తన కొడుకు స్థితి గుర్తుకు రాగా ఉంగరాన్ని జేబులో వేసుకుని, తన గ్రామం చేరాడు.

అది అమ్మగా వచ్చిన డబ్బుతో, అతడు కొడుక్కు పట్నంలో వైద్యం చేయించి, ఒక్కగానొక్క కొడుకును ప్రాణాపాయం నుంచి కాపాడుకున్నాడు.

కుర్రాడు ఇదంతా చెప్పి, దశరథయ్యతో, "అయ్యా, ఆ తర్వాత, మా నాన్న మీ బాకీ తీర్చేందుకు ఎంతగానో ప్రయత్నించాడు: అయినా సాధ్యపడలేదు. ఐతే, నెల రోజుల క్రితం బాగా జబ్బు చేసి చనిపోయేముందు, మా నాన్న ఈ జరిగినదంతా చెప్పి, తన కర్మకాండకు అట్టే ఖర్చు పెట్టవద్దనీ, ఇంట్లో వున్న ఎనిమిదివందల కాసులకు, మరి రెండువందలు ఎలాగైన చేర్చి, తమ కివ్వవలసిందనీ చెప్పాడు. పోయిన మా నాన్నను గురించి, దొంగగా చెప్పడం మనస్కరించక, వెయ్యి వెండి కాసుల్ని రహస్యంగా, తమ ఇంట్లోని దేవుడి గది ముందు పెట్టాను. ఆ డబ్బు తమదే!" అన్నాడు. చేతులు జోడించి నమస్కరిస్తూ.

ఆ కుర్రాడి నిజాయితీ చూసి, అక్కడ చేరినవాళ్ళందరూ ఆశ్చర్యపోయారు.

"సంగతేమిటో కనుక్కోకుండా, కనబడినవాళ్ళను పట్టుకుని దొంగ అంటూ కేకలు పెట్టడం, ఏం మర్యాదా!" అంటూ జనం దశరథయ్యను చివాట్లు పెట్టి వెళ్ళిపోయారు.

కుర్రాడు కూడా అక్కడినుంచి వెళ్ళిపోగానే, దశరథయ్య తన కూతురు చేతిలో వున్న డబ్బు సంచీ తీసుకోబోతూ "నీ పుట్టిన రోజున మంచి బహుమతి లభించింది. ఆడబ్బుతో నీకు బంగారు గొలుసు చేయిస్తాను." అన్నాడు.

ఆ మాటలకు భార్య అడ్డు వచ్చి. "ఇంకా నయం! పసిపిల్ల వంటి మీద బంగారం వుండడం ప్రమాదం. ఆ డబ్బుతో ముందు నేను గాజులు చేయించుకుంటాను" అన్నది.

సుమతి డబ్బు సంచీ వున్న చేతిని వెనక్కు లాక్కుని, తండ్రిని, "ఈ రోజుతో నాకు ఎన్ని సంవత్సరాలు నిండాయి నాన్నా?" అని అడిగింది.

"నాకు ఆ మాత్రం గుర్తు లేదనుకోకు, తల్లీ! ఈ రోజుతో నీకు తొమ్మిది నిండి, పది వస్తాయి." అన్నాడు దశరథయ్య.

"ఆ అబ్బాయి తీర్చిన బాకీ పన్నెండేళ్ళ కిందటిది. మనం, ఈ ఇల్లు కొన్న తర్వాత ఏడాదికి నేను పుట్టాను. అంటే, ఆ ఉంగరం, మనకు ఈ ఇల్లమ్మిన రామయ్య తాతదన్నమాట! పిల్లలు సరిగా చూడక, ఆరోగ్యం కూడా చెడి తాత చాలా కష్టాల్లో వున్నాడు. ఈ డబ్బు తాతకు బాగా ఉపయోగిస్తుంది. ఇది, తాతకు ఇచ్చి వస్తాను." అంటూ సుమతి బయలుదేరబోయింది.

దశరథయ్యా, అతడి భార్యా తమ కూతురి దయాగుణానికి అబ్బురపడ్డారు. దశరథయ్య భార్య కూతురును అప్యాయంగా ముద్దాడి, "ఆ డబ్బు, తాతకు రేపు యివ్వవచ్చులే, తల్లీ! ఇప్పుడు మనం గుడికి వెళ్ళాలి." అన్నది.

"ఈ రోజు గుడికి వెళ్ళకపోయినా ఫర్వాలేదు. తాతకు ఈ డబ్బు యిస్తే నాకు రెట్టింపు పుణ్యం వస్తుంది!" అంటూ సుమతి, రామయ్య తాత ఇంటికేసి పరుగుతీసింది.

వయసులో చిన్నదయినా, తమ కూతురి గొప్ప మనసు చూసి, ఆమె తల్లిదండ్రులు చాలా ఆనందపడ్డారు.

# * పెద్దదిక్కు *



సింహాచలం ఒక చిన్న గ్రామంలో వుంటూ పట్నంలోని గురవయ్య కిరాణా దుకాణంలో పద్దులు రాసే ఉద్యోగం చేస్తూండేవాడు. అతడి జీతం నెలకు రెండువందల రూపాయలు. చిన్నతనంలో తల్లిదండ్రులు పోగా, అతణ్ణి పినతల్లి మీనాక్షి పెంచి పెద్ద చేసింది. ఆమెకొక కూతురు. పెళ్ళీడు రాగానే కూతురుకు వివాహం చేసి, అత్తవారింటికి పంపి, తాను మాత్రం సింహాచలం ఇంట్లోనే వుంటున్నది.

సింహాచలం ఏ మాత్రం అందగాడు కాదు: పై పెచ్చు చిన్న జీతగాడు. ఐనా అతడి పెళ్ళి

మంచి అందచందాలు గల లావణ్యతో జరిగింది. అందుక్కారణం లావణ్య తల్లిదండ్రులు పేదవాళ్ళు కావడం.

ఈ పెళ్ళికాకముందు లావణ్య తన అందం చూసి మురిసిపోయి, ఏ జమీందారు కొడుకో తనను చేసుకుంటాడని కలలు కనేది. సింహాచలంతో పెళ్ళి ఆమెకు ఎంతమాత్రం యిష్టం లేదు. సింహాచలం పిన్ని మీనాక్షి తన తల్లిదండ్రులను పెద్ద కట్నం కోరాలనీ, ఆ విధంగా యీ పెళ్ళి తప్పిపోవాలనీ, ఆమె ఎందరో దేవుళ్ళకు మొక్కుకున్నది.

అయితే, మీనాక్షి మాత్రం లావణ్య తల్లిదండ్రులతో, "మా నుంచి కట్న కానుకల ప్రసక్తే వుండదు. ఈ శుభ సమయంలో దాని సంగతి మరిచిపోదాం." అన్నది.

ఈ మాట విని లావణ్య కుంగిపోయింది: ఆమె తల్లిదండ్రులు పొంగిపోయారు. ఈ విధంగా లావణ్యకు యిష్టం లేని పెళ్ళి జరిగిపోయింది. అందువల్ల, కాపురానికి వచ్చిన రోజునుంచి ఆమె కట్నం కోరని మీనాక్షిని శత్రువును చూసినట్టు చూడసాగింది.

నెల తిరక్కుండానే ఒకనాటి రాత్రి ఆమె, సింహాచలంతో, "ఈ రోజుల్లో సొంత అత్తలనే చూసేవాళ్ళు లేరు; ఇక పిన అత్తగారికి ఊడిగం చేసేదెవరు! మీ పిన్నిని, వాళ్ళ కూతురు దగ్గరకు వెళ్ళమని చెప్పు" అన్నది.

ఈ మాటలకు సింహాచలం నొచ్చుకొని "అదేం మాట! మా పిన్ని, మనకు ఇంట్లో పెద్ద దిక్కుగా వుంటుంది కదా" అన్నాడు.

ఆ జవాబుకు లావణ్య విసుక్కుంటూ, "మనకే తిండికి దిక్కులేదు. నీదేమైనా సముద్ర వ్యాపారమా? ఈ కరువు కాలంలో తిండిదండగ మనుషుల్ని ఎంతకని పోషిస్తాం?" అన్నది.

పక్క గదిలో నిద్రపోతూ, మంచినీళ్ళ కోసం లేచిన మీనాక్షి యీ మాటలు విన్నది. ఆమె తెల్లవారుతూనే, ఏ కారణం చెప్పకుండా కూతురు ఇంటికి ప్రయాణం కట్టింది. సింహాచలానికి యిది చాలా కష్టం అనిపించినా, భార్య నోటికి భయపడి, అతడేమీ మాట్లాడలేదు.

అతడు బాడుగబండిలో పినతల్లిని ఆమె కూతురు ఇంట దిగవిడిచి, పట్నం చేరేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. ఆ కారణంగా, అతడు బాగా పొద్దుపోయేవరకూ దుకాణంలో వుండవలసి వచ్చింది.

పట్నంనుంచి అతడి పల్లెకు మామూలు దారి కాకుండా, మరొక అడ్డదారి వున్నది. తొందరగా ఇల్లు చేరాలన్న ఆత్రంలో అతను జనం మసలని ఆ అడవిదారి పట్టాడు. సింహాచలం అడవి మధ్యలో వుండగానే చీకటిపడింది. అయితే పున్నమి రోజు కావడం వల్ల పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది.

అతడు ఒక చెట్టు కిందికి వచ్చేసరికి చెట్టు ఆకులు గలగలమన్నవి. ఆ వెంటనే ఆకుల

మధ్యనుంచి, "ఎవరో, వారెవరో రావాలి! వారికి అడిగిందివ్వాలి!" అంటూ కర్ణకఠోరమైన గొంతుతో ఒక పాట వినిపించింది.

సింహాచలం ఆశ్చర్యపోతూ తల ఎత్తిచూసి, అది ఒక నేరేడుచెట్టని గ్రహించి, నేరేడుచెట్టు ఏమివ్వగలదు? నేరేడు పండేగా!" అన్నాడు.

ఆ మరుక్షణం నేరేడు పండొకటి అతడి కాళ్ళ దగ్గిర పడింది. దాన్ని తీసుకుని సంచీలో వేసుకుని ముందుకు నడిచాడు సింహాచలం.

కొద్ది దూరం నడవగానే మరొక చెట్టు ఆకులు గలగలమన్నవి. తరవాత, ఏమివ్వను? నీకేమివ్వను? అంటూ మరింత కర్ణకఠోరమైన పాట వినిపించింది. సింహాచలం ఆ చెట్టును వెలగచెట్టుగా గుర్తించి, "వెలగచెట్టు ఇవ్వగలిగేది, వెలగపండు. అంతేగదా?" అన్నాడు.

మరుక్షణం ఆతడి కాళ్ళ దగ్గిర ఒక వెలగపండు పడింది. సింహాచలం దాన్ని కూడా సంచీలో వేసుకున్నాడు. అతడు మరి కొద్ది దూరం నడవగానే, మరొక చెట్టు ఆకులు కదిలి, "అందిస్తాను. అందుకో! అడిగింది ఆలోచించక ఇస్తాను తీసుకో!" అన్న మరింత కర్ణకఠోరమైన పాట వినిపించింది.

సింహాచలం రెండు చెవులూ మూసుకుని, ఆ చెట్టు మామిడిచెట్టని గ్రహించి, "మామిడి చెట్టు మామిడిపండు గాక యివ్వగలిగిందేముంటుంది!" అన్నాడు.

వెంటనే అతడి కాళ్ళ దగ్గిర మామిడి పండొకటి పడింది. సింహాచలం దాన్ని కూడా తీసుకుని కొంతసేపటికి ఇల్లు చేరాడు.

లావణ్య సంచీలో వున్న, ఆ మూడు పళ్ళనూ చూసి ఆశ్చర్యపోయి, "కాలం కాని కాలంలో యివి ఎక్కడ దొరి కినై, నీకు?" అంటూ భర్తను అడిగింది.

సింహాచలం జరిగినదంతా ఆమెకు చెప్పాడు.

లావణ్య అతడి కేసి కోపంగా చూస్తూ, "ఎంత బుద్ధిమాలిన పని చేశావు! నీతో మాట్లాడింది. ఆ చెట్లే అనుకున్నావా? ఆ మాట్లాడింది ఆ చెట్ల మీద వుండే పరోపకారి పిశాచాలో, వనదేవతలో అయివుంటవి. రేపు మళ్ళీ చీకటిపడ్డాక, ఆ దారినేరా, వాటిని ఏం అడగాలో తెల్లవారాక, నీకు చెబుతాను" అన్నది.

ఆమె రాత్రి అంతా నిద్రమాని, పిశాచాలను ఏం అడగాలో బాగా ఆలోచించి, తెల్లవారాక భర్తకు చెప్పింది.

మర్నాడు సింహాచలం చీకటిపడిన తరవాత అడవిదారిన బయలుదేరాడు. అతడు నేరేడుచెట్టును చేరుకునేసరికి చిన్నగా వర్షం ప్రారంభమైంది. నేరేడు ఆకుల గలగలలతోపాటు అతడికి కిందటి రాత్రి విన్న మాటలు కూడా స్పష్టంగా వినిపించినై.

భార్య చెప్పింది బాగా గుర్తు పెట్టుకున్న సింహాచలం, "నేరేడుచెట్టు నాకు అందాన్ని ప్రసాదిస్తే

ఎంత ఆనందపడతాను!" అన్నాడు.

చెట్టు మీది నుంచి ధారగా నీరు అతడి మీద పడింది. మెరుపుల వెలుగులో సింహాచలం తన శరీరాన్ని చూసుకుని, అది పసిమిఛాయలో వుండడంతో పరమానందం చెందాడు.

అతడు వెలగచెట్టును చేరేలోపల పెద్ద శబ్దంతో పిడుగుపడి, నేరేడుచెట్టు భగభగమనే మంటలతో నేల కూలింది.

వెలగచెట్టును చేరిన సింహాచలం "వెలగచెట్టు వెలలేని ఐశ్వర్యం యిస్తే అద్భుతం కదా!" అన్నాడు.

అతడి కాళ్ళ దగ్గిర ఒక ఖాళీ సంచి పడింది. సింహాచలం దాన్ని చేతికి తీసుకునేంతలో, సంచీలోంచి జలజలమంటూ ఆగకుండా బంగారు కాసులు పడసాగాయి. అతడు కిందపడిన కాసుల్ని వదల బుద్ధి కాక, వాటిని సంచీలో వేసుకుని, ఆ సంచీ మోసుకుంటూ బయలుదేరాడు.

అతడు మామిడి చెట్టును సమీపించగానే, పిడుగుపాటుకు గురి అయి, వెలగ చెట్టు నేలకు ఒరిగింది.

"మామిడిచెట్టు నా పైన అదృష్టాన్ని ముద్రగా వేస్తే, అమోఘంగా వుండదా!" అన్నాడు సింహాచలం చెట్టు, కొమ్మల్లోకి చూస్తూ.

వెంటనే అతడి తలపైన ఏదో పడినట్టయింది కాని తడిమి చూసుకుంటే అతడి చేతికి ఏమీ తగలలేదు. సింహాచలం అక్కడినుంచి కొంచెం ముందుకు కదలగానే మామిడిచెట్టు కూడా పిడుగుదెబ్బకు గురి అయింది.

ఆ తరవాత ఇంటి దారిపట్టిన సింహాచలానికి పెనుగాలి వల్లా, బంగారంతో బరువుగా వున్న సంచీవల్లా నడవడం కష్ట సాధ్యం కాసాగింది. అతడు కొంచెం ఎత్తుగా వున్న దిబ్బనొకదాన్ని ఎక్కి దిగబోతూ కాలుజారి, పక్కనే వున్న ఊబిలో పడిపోయాడు. బంగారుకాసుల సంచీ ఊబి అడుక్కు మునిగిపోయింది. అతడి శరీరం క్రమంగా భుజాలవరకూ ఊబిలో దిగబడి పోయింది.

ఇక తనకు చావు తప్పదనుకున్నాడు సింహాచలం. కాని అదృష్టం అతణ్ణి అంటిపెట్టుకునే వున్నది. హఠాత్తుగా దాపులనున్న చెట్టుకొమ్మ ఒకటి ఫెళ ఫెళ మంటూ విరిగి, అతడికి చేరువగా ఊబిలో పడింది. అతడు దాన్ని పట్టుకుని, ఊబినుంచి బయటపడ్డాడు.

సింహాచలం తూర్పు తెల్లవారుతూండగా ఇల్లు చేరి, స్పృహ తప్పి పడిపోయాడు. లావణ్యకు ఆస్థితిలో వున్న భర్తను చూసి దడపుట్టుకు వచ్చింది. ఏం చెయ్యాలో చెప్పేందుకు ఇంట్లో అనుభవం గల పెద్ద దిక్కంటూ లేదు! ఏమీ పాలుపోని లావణ్య, మీనాక్షికి కబురు పంపింది.

మధ్యాహ్నానికల్లా పుట్టెడు దిగులుతో మీనాక్షి వచ్చింది. ఆమె సపర్యలతో సింహాచలం ఒక నెల రోజులకు మామూలు మనిషి అయ్యాడు. అతడికి అడవిలో లభించిన బంగారం, పచ్చని

శరీర చ్ఛాయా పోగా – కొత్తగా శరీరం మీద అక్కడక్కడా మానిన గాయపు మచ్చలు మాత్రం మిగిలినై!

జరిగిందేమిటో వివరంగా విన్న మీనాక్షి లావణ్యతో, "నీ భర్తకు, మొదటి పిశాచాన్ని అందం అడగమని చెప్పావు; అందం కన్న ఆరోగ్యం ముఖ్యం. అది లేకపోతే, రెండో పిశాచి యిచ్చిన బంగారం వృథా. మొత్తం మీద మూడో దాన్ని కోరిన అదృష్టమే అతణ్ణి ఊబి నుంచి కాపాడింది." అన్నది.

"మీరు ఆ సమయంలో సలహా చెప్పడానికి లేరు. అందువల్లనే నేను, ఆయనను యీ అవివేకపు కోరికలు కోరమని, నానా అగచాట్లకూ గురిచేశాను" అన్నది లావణ్య, కళ్ళనీళ్ళతో

"ఇప్పుడైనా మించిపోయిందేం లేదు. అదృష్టం అండగా కష్టపడి పనిచేసే నీ భర్త తప్పక అభివృద్ధిలోకి వస్తాడు. పది కాలాల పాటు సుఖంగా వుండండి!" అని మీనాక్షి తిరుగు ప్రయాణానికి వెంట తెచ్చుకున్న పెట్టెలో బట్టలు సర్దుకో సాగింది.

లావణ్య కళ్ళనీళ్ళు తుడుచుకుని, ఆమె రెండు చేతులూ పట్టుకుని "అత్తయ్యా నా మూర్ఖత్వాన్ని క్షమించండి! మీరు ఎక్కడికీ వెళ్ళవద్దు. మీరు తప్ప మాకు పెద్ద దిక్కు లేదు," అన్నది దీనంగా.

లావణ్యలో వచ్చిన మార్పు మీనాక్షికే కాక, సింహాచలానిక్కూడా ఎంతో ఆనందం కలిగించింది.

# * కన్నతండ్రి *



చదువు పూర్తవగానే చైతన్య, పెద్ద శ్రమ పడకుండానే పట్నంలో ఉద్యోగం సంపాయించ గలిగాడు. అతడు కాపురం స్వగ్రామం నుంచి పట్టణానికి మార్చి, రోజూ బాడుగబండిలో కచేరీకి వెళ్ళి వస్తూండేవాడు.

ముసలివాళ్ళంటే చైతన్యకు తగని జాలి. అతడు బాడుగుబండి వీరయ్యకు నెలకు యాభై రూపాయలు యివ్వడమే గాక, "వీరయ్యా, యిద్దరు కొడుకులు సంపాయిస్తుండగా, ఇంకా నీకీ కష్టం ఎందుకు? హాయిగా ఇంటి పట్టున వుండి విశ్రాంతి తీసుకోకూడదా? " అనేవాడు.

వీరయ్య నవ్వి, "కొడుకుల సొత్తు నాకు పరాయి సొత్తుగా కనిపిస్తుంది. ఒంట్లో ఓపిక వున్నంతవరకూ, స్వయంగా సంపాదించుకుని బతకడంలోనే మనిషికి తృప్తి" అని జవాబిచ్చేవాడు.

చైతన్య తండ్రి, కొడుకును పట్నంలో చదివించడానికి అష్టకష్టాలు పడ్డాడు. ఇది ఎరిగిన చైతన్య ఎప్పుడైనా బాధపడితే, "నువ్వు ఉద్యోగంలో చేరిన రోజు నుంచీ, నేను అన్ని పనులు మానేసి హాయిగా ఇంట్లో కూర్చుంటాను" అనే వాడు ఆయన.

అయితే, చైతన్య ఉద్యోగ ప్రయత్నం చేస్తున్న రోజుల్లోనే ఆయన జబ్బుపడి, తీరా కొడుకు ఉద్యోగంలో చేరడానికి వారం రోజుల ముందు చనిపోయాడు. తండ్రిని కొద్దికాలమైనా సుఖపెట్టలేక పోయాననే బాధ చైతన్యను యింకా పీడిస్తూనే వున్నది.

చైతన్య కచేరీకి వెళ్లే దారిలోని బజారు కూడలిలో, ఒక డెబ్బై ఏళ్ళ ముసలివాడు బుట్టలో జంతికలూ, చేగోడీలూ పెట్టుకుని కూర్చుని వుండేవాడు. అతడు సాయంత్రం కచేరీ నుంచి తిరిగి వస్తూండగా, ముసలి వాడు అక్కడే తినుబండారాల బుట్ట ముందు చతికిలబడి కూర్చుని వుండేవాడు. రోజంతా ఎండలో అలా కాలం గడిపే ముసలివాడంటే చైతన్యకు ఎంతో జాలి కలిగేది. ఇలా రోజూ కనిపించే ముసలివాడు ఒకసారి వరసగా పది రోజులు కనిపించకపోయేసరికి అతడు చచ్చిపోయాడేమో అనుకుని బాధపడ్డాడు చైతన్య. కాని ఆ మర్నాడు ముసలివాడు తన మామూలు చోట జంతికలబుట్ట ముందు కూర్చుని కనిపించేసరికి చైతన్యకు చాలా ఆనందం కలిగింది.

అతను వీరయ్యను బండి ఆపమని ముసలివాడి దగ్గరకు వెళ్ళి, "పదిరోజులుగా కనిపించడం లేదేం, తాతా?" అని అడిగాడు.

తను ఎరగనివాడు యింత అప్యాయంగా పలకరించేసరికి, తాత తృప్తిగా తలాడించి, "బాబూ, రోజూ నేనిక్కడ కూర్చుని వుండడం చూస్తున్నావన్నమాట! నాకు యీమధ్య జ్వరం. ఇన్నాళ్ళూ మూసినకన్ను తెరవలేదు" అన్నాడు నీరసంగా.

చైతన్యకు అతడి మీద మరింత జాలి కలిగి, "తాతా, యీ బుట్టలో వున్నవన్నీ అమ్ముడైపోతే ఎంత వస్తుంది?" అని అడిగాడు.

"నాలుగు రూపాయలు అందులో రూపాయి లాభం." అన్నాడు ముసలివాడు.

"అలా అయితే, బుట్టలో వున్నవన్నీ నాకు యిచ్చెయ్యి. ఐదు రూపాయిలిస్తాను," అన్నాడు చైతన్య.

ముసలివాడు ఆశ్చర్యపోయి చూస్తూ వూరుకున్నాడు. చైతన్య బుట్టలో వున్నవన్నీ బండిలో పెట్టి, ముసలివాడికి ఐదు రూపాయలిచ్చి, బండిలో కూర్చున్నాడు.

వీరయ్య, చైతన్యను "యివన్నీ ఏం చేస్తారు బాబూ?" అని అడిగాడు.

"మీ యింటి చుట్టుపక్కల వుండే పిల్లలకు పంచు" అన్నాడు చైతన్య.

మర్నాడు మళ్ళీ బండి కూడలి చేరగానే, చైతన్య ఐదురూపాయలిచ్చి, ముసలివాడి బుట్టలో వున్నవన్నీ కొనేశాడు. మూడవరోజున కూడా బండి ఆపమన్న చైతన్యను, వీరయ్య "ఇలా ఎన్నాళ్ళు రోజుకు ఐదు రూపాయలు ఖర్చు చేస్తావు బాబూ?"అని అడిగాడు.

"ఈ తాత బతికి వున్నంతకాలం" అన్నాడు చైతన్య.

అయితే, అతడు ముసలివాణ్ణి సమీపించగానే, వాడు చేతులు జోడించి, "రోజూ నేవచ్చిన గంటలోనే అన్నీకొని, నన్ను మరింత కష్టాలపాలు చేయకు బాబూ! వెంటనే తెచ్చినవి అమ్ముడు పోవడంతో, నా కొడుకు ఇంటి దగ్గర నా చేత అడ్డమైన చాకిరీ చేయిస్తున్నాడు. నిన్న మండుటెండలో కట్టెలు కొట్టవలసి వచ్చింది" అన్నాడు.

ఇది విని చైతన్యకు ఆశ్చర్యంతో పాటు, చాలా బాధ కలిగింది. కొడుకు ద్వారా సుఖపడాలని ఆశించిన తన తండ్రి, ఆ అవకాశం రాకముందే చనిపోయాడు. ఆ అవకాశం వున్నా, వీరయ్య అందుకు యిష్టపడటం లేదు. తండ్రి చేత ఆఖరి క్షణం వరకూ అడ్డమైన చాకిరీ చేయిస్తూ తినుబండారాల బుట్ట ముందు పెట్టుకుని ఎండలో కూర్చోవడమే సుఖం అనిపించేలా చేస్తున్నాడు తాత కొడుకు!

చైతన్యకు ఆ క్షణాన ఒక ఆలోచన వచ్చింది. తాత కొడుక్కు బుద్ధి చెప్పాలనుకున్నాడు. అతడు ముసలివాడితో "తాతా మా ఇంటికి వస్తావా? నీకక్కడ తిండి తిప్పలుకు లోటుం వుండదు." అన్నాడు.

ముసలివాడు కొంచెం సేపు మౌనంగా వూరుకుని, "నా కొడుకు గొడవ లేపుతాడు బాబూ!" అన్నాడు.

"అదంతా నేను చూసుకుంటాను రా, బండెక్కు!" అని చైతన్య అతడి చేయిపట్టుకుని తీసుకుపోయి, బండిలో కూర్చోపెట్టి, ఇంటికి తీసుకుపోయాడు.

తాత కొడుకు అక్కడా యిక్కడా వాకబుచేసి, ఆ మర్నాడే వెతుక్కుంటూ చైతన్య ఇంటికి వచ్చాడు.

చైతన్య వాడికి, ముసలివాడు మండుటెండలో పడుతున్న బాధ గురించి చెప్పి, "ఈ వయసులో ముసలివాడైన తండ్రిని సుఖపెట్టడం పోయి, అతడి ద్వారా సంపాయించాలని చూస్తున్నావా?" అని అడిగాడు.

తాత కొడుకు జంకుతూనే, "అయ్యా అలాంటి స్వార్థం నాకేం లేదు. మా నాన్న సంపాదన, ఆయన తిండికి, బట్టకూ ఖర్చు పెడుతున్నాను" అన్నాడు.

"అలా అయితే మీ నాన్నను మా ఇంటనే వుంచి, ఆ తిండి బట్టా నేనే యిస్తాను. నీకేమైనా అభ్యంతరమా?" అని అడిగాడు చైతన్య.

తాత కొడుకు తండ్రి ముఖం కేసి సిగ్గుతో, అవమానంతో తలవంచుకున్నాడు. అప్పుడు చైతన్య వాడితో "నాకు తెలుసు. ఈ ముసలితనంలో నీ తండ్రి నీ దగ్గిర వుండడమే ధర్మం అయితే, అతణ్ణి ఇంటిపనివాడిలా కాక, కన్నతండ్రిలా ఆదరించు" అన్నాడు.

తాత కొడుకు పశ్చాత్తాపంతో కళ్ళ నీళ్ళు పెట్టుకుని, చేతులు జోడించి చైతన్యకు నమస్కరించి తండ్రితో, "నాన్నా రా ఇంటికి పోదాం. బుద్ధివచ్చింది, కళ్ళు తెరిపిడిపడినై," అంటూ తండ్రిని తన వెంట ఇంటికి తీసుకుపోయాడు.

# * దుష్టులకు దూరం *



జనార్ధనం తండ్రి వ్యాపారరీత్యా ఒక పెద్ద పట్నంలో ఉండేవాడు. ఆయన జనార్ధనానికి బోలెడు డబ్బు కూడబెట్టి ఈయడమే కాక, పోయేటప్పుడు, "నాయనా జనార్ధనం, నేను పోయాక నువ్వీ పట్నంలో ఉండవద్దు. ఏదైనా మంచి చోటు చూసుకుని స్థిరపడు. నేను సంపాదించినది నువ్వూ నీ పిల్లలూ పది కాలాల పాటు కష్టపడకుండా తినగలిగినంతవుంది." అని చెప్పి కన్నుమూశాడు.

తండ్రి పోయాక జనార్ధనానికి ఒక సమస్య పట్టుకుంది. ఎక్కడ స్థిరపడాలన్నది వాడికి తోచలేదు. స్వంత ఊరిలో వాణ్ణి ఆప్యాయంగా ఆదరించే వారు చాలా మంది ఉన్నారు.

అయితే ఆ ఊరు అట్టే మంచిది కాదు. నీటి సౌకర్యం సరిగా ఉండదు. ప్రకృతి దృశ్యాలు ఉండవు. అంతా రాతి ప్రదేశం!

జనార్ధనం ఆస్తిని కొంత బంగారం గానూ, కొంత నగదుగానూ మార్చుకుని, మంచి చోటు వెతుక్కుంటూ బయలుదేరాడు. పక్షం రోజుల తరువాత వాడికొక చక్కని ప్రదేశం నచ్చింది. సముద్రపు ఒడ్డున చిన్న పల్లెటూరు! సరుగుడు తోటలు. ఇసక దిబ్బలు. ఆ చల్లని ప్రశాంత వాతావరణం జనార్ధనాన్ని ఎంతగానో ఆకర్షించింది. వాడు సరుగుడు తోటలో చిన్న పాక వేసుకుని, అక్కడే స్థిరపడ్డాడు. రోజూ సాయంత్రం వాడొక చిన్న నాటు పడవలో సముద్ర విహారానికి వెళ్ళేవాడు.

ఆ పల్లెటూళ్ళో ప్రజలందరి ముఖ్యవృత్తి చేపలు పట్టటం. వాళ్ళకు ఏమీ కష్టపడకుండా తిని కూర్చునే, యీ కొత్తగా వచ్చిన మనిషిని చూస్తే అసూయగా ఉండేది.

ఒక రోజు ఎండవేళ జనార్ధనం ఇంటి ముందున్న సరుగుడుచెట్టు కింద మంచం వేసుకుని పడుకున్నాడు. అవతల ఎండ నిప్పులు చెరుగుతున్నా, ఆ సరుగుడు తోటలో చల్లగా గాలి వీస్తోంది.

ఎవరో పిలిచినట్లయి, జనార్ధనానికి మెలకువ వచ్చింది.

మంచం దగ్గిర ఒక మనిషి నిలబడి ఉన్నాడు. పొడుపాటి రాగి రంగు గడ్డమూ, నున్నని గుండూ – వాడు ఎర్రరంగు పొడుగు చేతుల అంగీ, నల్లనిపంచె ధరించి ఉన్నాడు. వాడి మెడలో కాకి ఈకల దండ ఉంది. వాడి కళ్ళు ఎర్రగా ఉన్నాయి. వాడు, "కుర్రాడా, చెంబెడు మంచి నీళ్ళు పట్రా! దాహంగా వుంది. ఎండలు మాడ్చేస్తున్నాయి. అన్నాడు జనార్ధనంతో.

జనార్ధనం మంచి నీళ్ళు తేవటానికి లోపలికి వెళ్ళబోయాడు.

"ఆగు, కుర్రాడా! చిక్కటి మజ్జిగలో చిటికెడు ఉప్పేసి పట్టుకురా! నా నోరు పిడచగట్టుకు పోయింది." అన్నాడా మనిషి.

జనార్ధనం "అలాగే" అని వెళ్ళబోయాడు.

"దాంట్లో ఒక నిమ్మకాయ కూడా పిండు, రుచిగా ఉంటుంది." అని కేక పెట్టాడా గడ్డపుమనిషి.

జనార్ధనం ఆ మనిషి అడిగినట్లు గానే ఒక గిన్నెలో ఉప్పు, నిమ్మకాయ రసమూ వేసిన మజ్జిగ పట్టుకొచ్చాడు.

ఆ పాటికే, ఆ మనిషి, జనార్ధనం వేసుకున్న మంచం మీద కూర్చుని తాపీగా కూనిరాగాలు తీసుకుంటున్నాడు. వాడు గుటగుట మజ్జిగ తాగేసి, "గిన్నె నిక్షేపంలా ఉంది. ఎవరయినా కాజేయగలరు, లోపల దాచిరా!" అన్నాడు.

జనార్థనం గిన్నె లోపల పెట్టి వచ్చేసరికి, ఆ మనిషి మంచం మీద అడ్డంగా పడుకుని ఉన్నాడు. "మంచి ఎండ వేళ కదూ, నిద్ర ముంచుకు వస్తోంది ఒక కునుకు తీసి లేస్తాను" అని క్షణంలో ఆ మనిషి గుర్రు పెట్టసాగాడు.

జనార్థనం ఏమీ అనలేక పోయాడు. వాడు ఇంటి అరుగు మీద కూర్చుని, సాయంత్రం దాకా కాలక్షేపం చేశాడు. చీకటి పడ్డాక ఆ మనిషి లేచి ఆవులిస్తూ, "అప్పుడే చీకటి పడిపోయింది. ఒంటరి జీవితమై పోయింది. ఇంట్లో దీపం వెలిగించే దిక్కు కూడా లేదు." అంటూ తిన్నగా పాకలో కెళ్ళి, గూట్లో దీపం వెలిగించాడు.

వాడి అతి చనువుకు జనార్థనానికి చిరాకు వేసింది. "బాగా చీకటిపడి పోయింది. ఇక నువ్వు వెళ్ళవచ్చు." అని కోపాన్ని దిగమింగుతూ అన్నాడు.

ఆ మనిషి జనార్థనాన్ని ఎగాదిగాచూసి, "ఎవడివయ్యా, నువ్వు? నా ఇంటికి వచ్చి నన్నే దబాయిస్తావా? వెళ్ళు, వెళ్ళు. మర్యాద ఇచ్చి పుచ్చుకోవాలి తెల్సిందా?" అంటూ జనార్థనాన్ని అవతలకు నెట్టి, తలుపు మూసుకున్నాడు.

ఆ రాత్రంతా జనార్థనం, తలుపు బాదుతూ అవతలే ఉన్నాడు. ఆ మనిషి, "నా ఇంటి తలుపులు బద్దలవుతే నువ్వే డబ్బు లిచ్చుకోవాలి." అనేసి నిద్ర పోయాడు. కొంతసేపటికి తెల్లవారింది. ఊరి వాళ్ళు చేపల వేటకి బయలుదేరారు. జనార్థనం వాళ్ళందరినీ పిలిచి, "ఈ అన్యాయం చూడండి." అంటూ జరిగినదంతా చెప్పాడు.

ఇంతలో ఆ మనిషి తలుపు తీసుకుని వచ్చి, "వీడెవడో పిచ్చివాడిలా ఉన్నాడు. నా ఇంటిని పట్టుకుని తన ఇల్లంటూ రాత్రంతా ఒకటే రచ్చ!" అన్నాడు.

జనార్థనానికి ఆవేశం వచ్చి, "మీరే చెప్పండి. ఈ ఇల్లు నాదా, వాడిదా? మీరంతా రోజూ వస్తూ పోతూ నన్ను చూడటంలేదూ? ఈ దొంగపీనుగకి బుద్ధి చెప్పండి." అన్నాడు కోపంగా.

ఊరి వాళ్ళంతా జనార్థనాన్ని కిందనుంచి పైదాక తేరిపార చూసి, "ఎవడివిరా నువ్వు? చూస్తే దొంగవిలా ఉన్నావు. ఈ ఇల్లు ఈ గడ్డపాయనదే! మేం రోజూ ఇతన్నే చూస్తున్నాం. మేం ఇప్పటిదాకా నిన్ను చూసిన పాపాన పోలేదు. మర్యాదగా నీ దారిన నువ్వుపో, లేకపోతే ఎముకలు విరిగేలా తంతాం!" అని జనార్థనాన్ని దబాయించారు.

జనార్థనం నిర్ఘాంతపోయాడు. ఊరివారంతా తన మీద అసూయతో, తన ఆస్తి కాజేయాలనే దురుద్దేశంతో ఈ నాటకం ఆడుతున్నారని వాడు గ్రహించాడు. వాడు రెండుసార్లు గట్టిగా తల విదిలించి వెర్రి చూపులు చూస్తూ, "మీరు నా కళ్ళు తెరిపించారు. ఇన్నాళ్ళూ ఈ ఇల్లు నాదనుకున్నాను. అయితే నేను పెట్టెలో పెట్టి దాచిన బంగారం కూడా నాది కాదా?" అని అమాయకంగా వాళ్ళని అడిగాడు.

వాళ్ళు జనార్ధనం మతి కోల్పోయాడని రూఢి పరుచుకుని, "నీది కాదు. ఆ బంగారం అంతా మాది. అది ఎక్కడదాచావో త్వరగా చెప్పు!" అంటూ ఆత్రుతగా వాణ్ణి అడిగారు.

జనార్ధనం దూరంగా వున్న ఎత్తైన ఇసకదిబ్బను చూపించి, "పెట్టెడు బంగారం ఆ ఇసకదిబ్బలోనే ఉంది." అన్నాడు.

అంతా ఎవరికి వారే కాలిసత్తువ కొద్దీ ఆ వైపుకి పరిగెత్తారు. ఆ బంగారం ఎవరికి వారే తమ సొంతం చేసుకోవాలని ఆత్రం. గడ్డంమనిషితో సహా అందరూ ఆ వైపుకి పరిగెత్తి పోగానే, జనార్ధనం తేలిగ్గా నిట్టూర్చి, సరుగుడు చెట్టు మొదట్లో పాతి పెట్టిన బంగారం ఉన్న పెట్టెను తీసుకుని, అప్పటి కప్పుడు నాటు పడవలో బయలుదేరి ఆ దుష్టులకు దూరంగా వెళ్ళిపోయాడు.

మంచి చోటు అని తండ్రి అనటంలో అసలు అర్థం మంచి మనుషులున్న చోటని జనార్ధనం తెలుసుకుని, తమ సొంత ఊరు వెళ్ళిపోయి, తనని ఆదరించే వారి మధ్య ఆనందప్రదం అయిన జీవితం గడిపాడు.

# * పారిపోయిన దొంగ *



వీధి తలుపు చప్పుడు కావడంతో, వంటగదిలో ఉన్న రమ వచ్చి తలుపు తీసింది. ఆ సరికే బాగా చీకటి పడింది.

అవతల ఉన్న మనిషి ఆమెను తోసుకుని లోపలికి వచ్చి, చప్పున తలుపుమూసి, "అరిచావంటే పీక నులిమేస్తాను. అన్నింటికీ తెగించాను! ఖైదులో నుంచి పారిపోయి వస్తున్నాను!" అన్నాడు కరకుగా.

వీధి వెంట నలుగురు మనుషులు పరిగెత్తిన శబ్దం అయింది. వాళ్ళు దొంగను తరుముకుంటూ వస్తున్న రక్షక భటులు.

వాళ్ళను దూరం కానిచ్చి, రమ నవ్వుతూ, "చెరసాలలో సుఖంగా కాలం గడపక, ఏం బావుకుందామని పారిపోయి వచ్చావు?" అని దొంగను అడిగింది.

దొంగ కోపంగా, "ఆ విషయం నీకు అనవసరం. ఇంట్లో ఇంకా ఎవరు ఉన్నారు?" అని అడిగాడు.

"నీ కేమీ భయంలేదు. నేను ఒంటరిగానే ఉన్నాను. వంట సగం అయింది. వంట గదిలోకి వస్తావా?" అంటూ దారితీసింది రమ.

దొంగ ఆమె వెనకనే వంటగదిలోకి వెళ్ళి, ఆమె వేసిన పీటమీద కూర్చున్నాడు.

రమ వంకాయలు తరుగుతూ కళ్ళనీళ్ళు పెట్టుకుని, కొంగుతో తుడుచుకున్నది.

"నేను నిన్ను ఏమీ చెయ్యలేదే? ఎందుకు కన్నీళ్ళు?" అని దొంగ అడిగాడు.

"నిన్ను చూస్తే మా అన్న గుర్తుకు వచ్చాడు. వాడు ఆవేశంలో ఎవరినో కొట్టి, ఖైదు అయ్యాడు. అయితే ఒక రాత్రి నీలాగే పారిపోయి వచ్చాడు. వచ్చిన క్షణం నుంచీ వాడికి శాంతి లేదు! నిద్రలేదు! అన్న హితవు లేదు! ఇల్లు కదలాలంటే భయం! బయట ఏ చప్పుడు వినిపించినా రక్షకభటులు వస్తున్నారని భయం! పిచ్చివాడిలా తయారయినాడు. శిక్ష పూర్తిగా అనుభవించి వస్తే ఇలాటి భయాలు ఉండవు. ధైర్యంగా కొత్త జీవితం ఆరంభించవచ్చును. ఆ మాట నేను చెప్పాను. వాడు వినలేదు. పది రోజులపాటు ఇంట్లోనే అజ్ఞాతవాసం చేశాడు. పదో రోజు రాత్రి హఠాత్తుగా రక్షకభటులు వచ్చారు. భయంతో ఆలోచించకుండా మేడ మీదినుంచి దూకేసి, దెబ్బలు తగిలి, రెండు రోజుల అనంతరం చచ్చిపోయాడు." అంటూ రమ కథ ముగించింది.

దొంగ ఆమెను చూసి జాలిపడుతూ, "గొంతు తగ్గించు! ఎవరైనా రాగలరు!"అన్నాడు.

"వంట అయింది భోజనం చేస్తావా?" అన్నది రమ.

దొంగకు తినాలనే ఉన్నదిగాని సందేహించాడు.

"ఇందులో విషం కలపలేదులే! నీ ఎదటేగా వంట చేశాను?" అంటూ రమ దొంగ ముందు అన్నం, కూరలూ వడ్డించింది.

వాడు భోజనం చేస్తుంటే రమ. "చూడబోతే మంచివాడివిలాగున్నావు! చెరసాలలో ఎలా పడ్డావు?" అని అడిగింది.

దొంగ ఇలా చెప్పాడు :

"నా తల్లిదండ్రులెవరో నాకు తెలీదు. ఒక అవ్వ నన్ను పెంచి, పెద్దచేసింది. నన్ను గారాబంగా పెంచడానికి తాను అష్టకష్టాలూ పడింది. ఆమె పోయాక నా కష్టాలు ప్రారంభమయ్యాయి. నాకు చదువు లేదు. మా పల్లెలో పనిలేక పట్నం వచ్చాను. ఏ పనీ ఇచ్చినవారు లేరు. నాలుగు రోజులు తిండిలేదు. ఆకలి బాధకు తాళలేక, ఒక వ్యాపారస్థుడి చేతిలో ఉన్న సంచీ లాక్కుని,

పారిపోయి పట్టుబడ్డాను. రెండు నెలలు శిక్ష పడింది."

"అలానా పాపం! మరి ఇప్పుడు పారిపోయి ఎందుకు వచ్చావు?" అని రమ అతన్ని అడిగింది.

"అక్కడ అడ్డమైన చాకిరీ చెయ్యాలి. పెద్ద ఎత్తున వంటలు చెయ్యాలి. తోట పని చూడాలి, బట్టలు పిండాలి. చాపలూ, దుప్పట్లూ నేయాలి. బట్టలు కుట్టాలి ఇలా ఎన్నో రకాల పనులు! అవన్నీ చేసే ఓపిక నాకు లేదు." అన్నాడు దొంగ విసుక్కుంటూ.

రమ నవ్వి, "బయట పని దొరకలేదని, దొంగతనం చేసి, చెరసాలకు వెళ్ళావు! అక్కడ పని ఎక్కువ అని దొంగతనంగా పారిపోయి వచ్చావు! ఇప్పుడు ఏం చేస్తావు?" అని అడిగింది. దొంగ జవాబు చెప్పలేక తల దించుకున్నాడు.

రమ మళ్ళీ ఇలా అన్నది :

"ఇప్పటినుంచీ నీకు నరకబాధలు ప్రారంభమవుతాయి. నిద్రాహారాలుండవు! భయం నిన్ను నీడలా అంటిపెట్టుకుని ఉంటుంది. ఇప్పుడు నువ్వు ఎలా బతుకుతావు? ఉద్యోగం ఎలా దొరుకుతుంది? నీ కిప్పుడు జైలులో ఉన్న స్వేచ్ఛ కూడా లేదు. పారిపోయివచ్చి నీ ఖైదు శిక్షను పెంచుకున్నావు. అంతే! ఆ చెరసాలలోనే ఏ వంటలు చెయ్యడంలోనో, బట్టలు కుట్టడంలోనో, దుప్పట్లు నెయ్యడంలోనో, తోటపనిలోనో ప్రావీణ్యం సంపాదించి ఉంటే, విడుదల అయివచ్చాక, నీ బతుకు నువ్వు స్వతంత్రంగా, గౌరవంగా బతికే మార్గం దొరికేది. అక్కడ నీకు శిక్షతోబాటు ఏదో వృత్తిలో శిక్షణ కూడా దొరుకుతుంది! నువ్వు చాలా తెలివితక్కువ పని చేశావు–పారిపోయి వచ్చావు!"

దొంగకు కళ్ళు తెరుచుకున్నాయి. అతను తాను చేసిన పొరపాటు గ్రహించాడు.

"నిజమే! పొరపాటు జరిగిపోయింది. దీన్ని దిద్దుకోవడమెలాగ? " అని అతను రమను అడిగాడు.

"మించిపోయిందేమీ లేదు. నీ అంతట నువ్వే చెరసాలకు వెళ్ళి, పట్టుబడు. అలా చేస్తే నిన్ను దండించరు! కొద్దిగా నీ శిక్ష పెరగవచ్చు. పని నేర్చుకోడానికి అదీ మంచిదే!" అన్నది రమ.

దొంగ సంతోషంగా, "సొంత చెల్లెలు లాగా మంచి సలహా చెప్పావు. నీ ఋణం తీర్చుకోలేను. వస్తా!" అని, వెళ్ళిపోయాడు.

దొంగ వెళ్ళిన కొంతసేపటికి మళ్ళీ తలుపు చప్పుడు వినిపించింది.

ఈ సారి వచ్చినవాడు రమ తండ్రి.

"ఎప్పుడూలేంది, ఇంత ఆలస్యం అయిందేం, నాన్నా?" అని రమ తండ్రిని అడిగింది.

"చెరసాల నుంచి ఒక దొంగ పారిపోయాడు. అందుకే ఆలస్యం అయింది." అన్నాడు తండ్రి.

ఆయన చెరసాల అధికారి.

"మీరు ఖైదీలను చూసే తీరు అలా ఉంటుంది! చెరసాల కేవలమూ ఖైదీలను శిక్షించటానికే

కాదు, వాళ్ళలో పరివర్తన కలిగించేదిగా కూడా ఉండాలి. మీ చెరసాల నుంచి పారిపోయిన దొంగ మన ఇంటికే వచ్చాడు. నేను ఆ దొంగలో ఉన్న దొంగను పారదోలాను. అందుకోసం ఒక అన్నయ్యను కూడా కల్పించాను." అంటూ రమ జరిగినదంతా చెప్పింది.

"భేష్! చెరసాల అధికారి కూతురివి అనిపించుకున్నావు! అతను చెరసాల చేరాడో, లేదో చూసివస్తాను." అంటూ ఆయన లేచాడు.

"ఆ భయం నీకు వద్దు. చెప్పానుగా, అతనిలో దొంగ పారిపోయాడు! భోజనం చేసి నిదానంగా వెళ్ళవచ్చు," నువ్వు అన్నది రమ.

# * మహత్తర మూలిక *



సోమశేఖరుడు అనే యువకుడు చాలా కాలం తన అవ్వ రెక్కల కష్టంతో పెరిగి, ఆమె పోగానే దిక్కూ, దరీ లేనివాడై పోయాడు.

ఆ ఊళ్ళోనే రామయ్య తాత అనే వైద్యుడు ఉండేవాడు. నలభై ఏళ్ళ క్రితం ఎక్కడినుంచో ఆ ఊరికే వచ్చి, స్థిరపడి, చుట్టుపక్కల ఊళ్ళలో గొప్ప వైద్యుడని పేరు తెచ్చుకున్నాడు. ఆయనకు ఏదో మహత్తర మూలిక తెలుసు. ఆయన రహస్యంగా అడవికి వెళ్ళి, ఆ మూలిక తెచ్చి, దానితో ఇతర దినుసులు చేర్చినూరి, గుళికలు చేసేవాడు. ఆయన గుళిక ఒక్కటి వేసుకుంటే, ఎలాటి జబ్బుగాని ఎగిరి చక్కాపోతుందని ఆ ఊరి ప్రజల నమ్మకం.

రామయ్య తాత డెబ్బై అయిదేళ్ళ వృద్ధుడు. ఆయనకు ఎవరూ లేరు. ఆయన దగ్గర చేరి, మూలిక రహస్యం తెలుసుకుంటే, జీవితాంతమూ సుఖంగా బతకవచ్చునని సోమశేఖరుడు ఆలోచించాడు.

ఈ ఆలోచనతో వాడు రామయ్య తాత ఇంటికి వెళ్ళాడు. లోపల గుళికలు చేసుకుంటున్న ముసలాయన తన పని కట్టిపెట్టి, ఇవతలకి వచ్చి, "నీ కేమీ జబ్బులేదు. నిక్షేపంలా ఉన్నావు. ఇంటికి వెళ్ళు." అన్నాడు.

"నేను జబ్బు నయం చేసుకోవటానికి రాలేదు. ఈ ముసలితనంలో నీకు అండగా ఉందామని వచ్చాను. నాకు ఇంటి దగ్గిర పని ఏమీలేదు." అన్నాడు సోమశేఖరుడు.

"నీ చేత చేయించుకునే పని కూడా నాకు ఏమీలేదే!" అన్నాడు ముసలాయన.

"ఇంటి పని అంతా చేస్తాను. అడవికి వెళ్ళి నీకు కావలసిన మూలికలు తెస్తాను." అన్నాడు సోమశేఖరుడు.

ముసలాయన సోమశేఖరుణ్ణి ఎగా దిగా చూసి, "సరే, ఇంటి పని నువుచూడు. మిగిలిన పని నేను చూసుకోగలను." అన్నాడు.

సోమశేఖరుడు నిరుత్సాహపడక, ఆ రోజే పనిలో చేరాడు. ముసలాయన అతణ్ణి అన్ని పనులూ చెయ్యనిచ్చేవాడు. కాని మూలికలు తేవటానికి అడవికి వెళ్ళేటప్పుడు తన వెంట రానిచ్చేవాడు కాడు. తాను గుళికలు తయారుచేసేటప్పుడు సోమశేఖరుణ్ణి ఆ చాయల ఉండనిచ్చేవాడు కాడు.

మూడు మాసాల అనంతరం ఒకనాడు సోమశేఖరుడు ముసలాయన దగ్గిర తన మనసులో మాట చెప్పతూ, "తాతా, నువ్వు కాటికి కాళ్ళు చాచుకుని ఉన్న వాడివి. అన్ని రోగాలూ **నయం** చెయ్యగల శక్తి నీకున్నది. మహత్తర మూలిక ఒకటి నీకు తెలుసు. దాని రహస్యం నీతోనే అంతమవటం మహా అన్యాయం! అదేదో నాకు చెప్పు. నీ అనంతరం నేను నీ పేరు మీదుగా వైద్యం చేస్తాను. అందరూ నీ పేరు చెప్పుకుని ఇంట్లో దీపం పెట్టుకుంటారు" అన్నాడు.

రామయ్య తాత విరగబడి నవ్వి "నా కేంరా? దుక్కలా ఉన్నాను. ఇప్పుడప్పుడే చస్తానని భ్రమపడకు" అన్నాడు.

ఆ తరవాత సోమశేఖరుడు ఆ విషయం మరి ఎత్తలేదు. ఒక సంవత్సరం పాటు వాడు ముసలాయనకు శ్రద్ధగా సేవలు చేశాడు. ఈ కాలంలో ఇద్దరి మధ్యా, వారికే తెలియకుండా, ఒకరిమీద ఒకరికి ఎంతో ఆప్యాయత ఏర్పడింది.

ఒకరోజు రామయ్యతాతకు పెద్ద జబ్బు చేసింది. ఆయనను చూసి సోమశేఖరుడు కళ్ళనీరు పెట్టుకుని, "రెండు గుళికలు మింగు తాతా! జబ్బు పోతుంది" అన్నాడు.

ముసలాయన నీరసంగా నవ్వి, "ఇంక ఈ ఘటం వెళ్ళిపోతుందిరా ఇది గుళికలతో నయమయే జబ్బుకాదు" అన్నాడు.

తరవాత ఆయన వాడితో "మూలికా రహస్యం చెప్పమన్నావా?" అన్నాడు. "ఇప్పుడు వద్దులే,

తాతా, కాస్సేపు విశ్రాంతి తీసుకో. ముందు నీ జబ్బు నయంకానీ" అన్నాడు సోమశేఖరుడు.

ఆ రాత్రి రామయ్యతాత తన మంచం పక్కనే నేలమీద పడుకున్న సోమశేఖరుణ్ణి లేపి, "నాయనా, నా మూలికా రహస్యాన్ని తాటాకు మీద రాసి పెట్టెలో పెట్టాను. నేను పోయాక తీసి చదువుకో" అని పడుకున్నాడు.

అలా పడుకున్న మనిషి మరి లేవలేదు. సోమశేఖరుడు రామయ్య తాత కోసం తండ్రి పోయినంతగా ఏడ్చాడు. వాడు రామయ్యతాతకు శ్రాద్ధ కర్మలు యధావిధిగా చేశాడు. ఇక వాడికి ఆ ఇంట ఉండ బుద్ధిపుట్టలేదు. వాడు ఆ ఇల్లు వదిలి పోదామనుకుంటూండగా, రామయ్యతాత తనతో అన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

వాడు పెట్టెలో నుంచి తాటాకు తీసి ఇలా చదువుకున్నాడు.

"నాయనా, శేఖరం ఆఖరుదశలో నువు నాకు దిక్కు అయ్యావు. మూలిక రహస్యం తెలుసుకోవటానికే నువ్వు నా దగ్గిర చేరావు. అయితే రానురాను ఇద్దరమూ స్నేహితులమయాం. నాకు తెలిసిన మహత్తర మూలిక ఏమిటో తెలుసునా? ప్రజల విశ్వాసం! నాకు ప్రజల విశ్వాసం లభించగానే నా గుళికలకు మహత్తర శక్తి వచ్చింది. నేను పోయినా ఇల్లు నీదే. పెరట్లో జామచెట్టు కింద నా డబ్బు చాలా దాచాను. దానితో నీ యిష్టం వచ్చిన వ్యాపారం చేసుకో నీకు మేలు కలుగుతుంది.

సోమశేఖరుడు మనసులో రామయ్య తాతకు ధన్యవాదాలు చెప్పుకుని, ఆయన చెప్పిన ప్రకారమే చెయ్యటానికి నిర్ణయించుకున్నాడు.

# * దొంగ-తేలు *



అర్ధరాత్రివేళ మంచి నిద్రలో వుండగా, పక్కన, "అమ్మో!" అన్న కేక విని సుజాత ఉలిక్కిపడి నిద్ర లేచింది. తల దగ్గిర చీకట్లో ఎవరో మనిషి నిలబడి, చెయ్యి విదిలించుకుంటూ వుండడం చూసి, ఆమె గుండె జల్లుమన్నది.

ఇంట్లో ఆమె ఒక్కతే వున్నది. తండ్రి పొరుగూళ్ళో ఏదో సంబంధం వున్నదని తెలిసి, ఆ సంగతి విచారించిరావడానికి వెళ్ళాడు. వెళ్ళేముందు పనిమనిషిని కూతురుకు తోడుగా వుండమని చెప్పాడు. అయితే, అనుకోకుండా దాని భర్తకు జబ్బుచేసి, అది ఇంటికి వెళ్ళిపోయింది. సుజాతకు ఒంటరిగా వుండక తప్పలేదు. ఎవడో దొంగ, వంటగది పై పెంకులు తొలిగించి,

ఇంట్లో ప్రవేశించాడు.

సుజాతకు భయంతో ఏమిచేయడానికీ పాలుపోలేదు.

దొంగ ఆమెతో, "తొందరగాలే! నీ తల కింద పెద్ద తేలున్నది" అన్నాడు చేతిని బాధగా విదిలించుకుంటూ. అతను సుజాత తల కింద తాళంచెవుల కోసం వెతుకుతుండగా, తేలు కుట్టింది.

సుజాత అందుబాటులో వున్న దీపం వత్తిని పెద్దది చేసి, చప్పున మంచం దిగింది.

దొంగ దిండును పక్కకు తోసి, అక్కడ వున్న పెద్ద నల్లతేలును కిందికి విదిలించి, చెప్పుతో కొట్టి చంపేశాడు.

సుజాతకు తేళ్ళంటే చెడ్డభయం. దొంగ సమయానికి రాకపోతే, తేలు తనను తప్పక కుట్టి వుండేదే! ఆమెకు దొంగ పట్ల కృతజ్ఞతా భావం ఏర్పడింది.

దొంగ యింకా బాధపడుతూ వుండడం చూసి, ఆమె అతడి వేలుకు కరక్కాయ అరగదీసి రాసి, పాతగుడ్డల పొగ వేసి, వేలు మంట పోయేందుకు ఊదుతూ కూర్చున్నది.

దొంగ ఆమెకేసి చూస్తూ, "ఇంత యింట్లో ఒక్కదానివే వున్నావేం? ఒంటరిగా వుండడం ప్రమాదం అని తెలియదా" అన్నాడు.

"ఇలా ఎప్పుడూ వుండను. ఈ రోజు మా నాన్న పొరుగూరు వెళ్ళాడు. చూడబోతే చదువుకున్నవాడిలా వున్నావు, ఇలా దొంగతనానికి ఎందుకు బయలుదేరినావు?" అని అడిగింది సుజాత.

దొంగ దిగులుగా మొహం పెట్టి, "అంతా చెబుతాను నా పేరు మురళి. నన్ను మా అవ్వ గారాబంగా పెంచి పెద్ద చేసింది. అవ్వ మురిపం వల్ల నాకు చదువు అంతగా అబ్బలేదు. చెడు స్నేహాల కారణంగా అవ్వ పెట్టెలోంచి చిల్లర డబ్బులు దొంగిలించేవాడిని. ఆ మధ్య అవ్వ పోయింది. మా ఊరు నుంచి యీ పట్నం వచ్చాను. ఇక్కడ ఎంత ప్రయత్నించినా, పని దొరకలేదు. మూడు రోజులు పస్తులుండి చివరికి యీ దొంగతనానికి దిగాను" అన్నాడు.

సుజాత అతడి స్థితికి జాలిపడింది. ఇంట్లో వున్న పళ్ళు తినమని యిచ్చింది. తెల్లవారేదాకా బాధ కలగకుండా అతడికి కబుర్లు చెబుతూ కూర్చున్నది. మురళి మంచి అందగాడు. కాని అతడి దొంగబుద్ధి ఆమెకు కలవరం కలిగిస్తున్నది.

"ఉదయానే మా నాన్న వస్తాడు. నిన్ను ఆయనకు మా స్నేహితురాలి అన్నగా పరిచయం చేస్తాను. నిరుద్యోగివనీ, ఏదైనా ఉద్యోగం యిప్పించమని చెబుతాను. దొరికిన పనేదో చేస్తూ సుఖంగా కాలం గడపడానికి నీకు అభ్యంతరం వుండదనుకుంటాను" అన్నది సుజాత.

మురళి సంతోషంగా తలాడించి, సుజాత తండ్రి రాకముందే వంటగది కప్పు పెంకులు సర్ది పెట్టేశాడు. బారెడు పొద్దెక్కాక సుజాత తండ్రి తిరిగి వచ్చాడు. తండ్రి ముఖం చూస్తూనే

వెళ్ళిన సంబంధం కుదరలేదని సుజాత గ్రహించింది. ఆమె తండ్రికి మురళిని తన స్నేహితురాలి అన్నగా పరిచయం చేసి, "ఉద్యోగం కోసం పట్నం వచ్చాడట" అన్నది.

సుజాత తండ్రి మాటల ధోరణిలో మురళిని రకరకాల ప్రశ్నలు అడిగి చూశాడు. మురళి జవాబులూ, అతడు వినయంగా ప్రవర్తించిన తీరూ అయనకు బాగా నచ్చినై. అప్పటికే సంవత్సరం నుంచి కూతురు పెళ్ళికోసం ఎన్నో ఊళ్ళు తిరిగి విసిగిపోయి వున్న అతడికి మురళినే తన ఇంటి అల్లుడుగా చేసుకుంటే బావుండును గదా అనిపించింది.

సుజాత తండ్రి కూతురును ఒంటరిగా చూసి "అమ్మా యీ అబ్బాయి నీ స్నేహితురాలి అన్న అంటున్నావు. మనిషి బావున్నాడు, మాటతీరు చూస్తుంటే చాలా సాధువులా వున్నాడు. ఇలాంటి వాడికి ఏదైనా ఉద్యోగం యిప్పించడం కష్టం కాదు. నాకు నచ్చాడు, నీకు నచ్చేటట్లుంటే, మీ యిద్దరికి వివాహం చేసేస్తాను" అన్నాడు.

సుజాత తండ్రికి ఎటూ తేల్చి చెప్పకుండా "తొందరేముంది నాన్నా!" అని వూరుకున్నది.

ఆమెకు మురళి మీద యింకా పూర్తి నమ్మకం కలగలేదు. అతడు పెరిగిన వాతావరణం, చెడ్డ స్నేహితుల ప్రభావం అంత త్వరగా వదిలేవికాదని ఆమె అనుకున్నది. ఆ సాయంత్రం మురళికి తమ తోట అంతా తిప్పి చూపించింది. చీకటి పడి ఇల్లు చేరాక, ఒక పెట్టెలో వున్న నగలు అతడికి చూపించి, "ఇవి మా అమ్మవి మా ఇంట్లో యింతకన్న విలువైనవి మరేం లేవు." అన్నది.

ఆ రాత్రి మురళికి మరి నిద్రపట్టలేదు. అతని కళ్ళముందు సుజాత చూపించిన నగలు తళుక్కుమంటున్నాయి. ఆ నగలు ఎత్తుకుపోయి అమ్మి, ఆ డబ్బుతో హాయిగా బతకవచ్చునన్న ఆలోచన అతడికి కలిగింది. అలా కాక, బతికినన్నాళ్ళూ ఒకళ్ళకింద నౌకరీ చేస్తూ కష్టపడడం ఎందుకు? అనుకున్నాడు.

ఇలా ఒక నిశ్చయానికి వచ్చి మురళి ఒక రాత్రివేళ నగలపెట్టె తీసుకుని, పెరటి దారిన పారిపోయాడు. అతడు కొంతదూరం వెళ్ళి నగల పెట్టెను దగ్గిర వుంచుకోవడం ప్రమాదం అని భావించి నగలు మాత్రం తీసుకుందామని పెట్టె తెరిచి, ఉలిక్కిపడ్డాడు. నగల మధ్య నల్ల తేలు వున్నది!

తేలు మళ్ళీ ఎక్కడ కుడుతుందో అన్న భయంతో అతడు నగలపెట్టెను చప్పున జారవిడిచాడు. నగలతోపాటు కిందపడిన తేలు కదలలేదు. అది బొమ్మ తేలని గ్రహించిన మురళి దాన్ని పక్కకు తోసి నగలు తీసుకుంటూండగా వాటి మధ్య ఒక చీటి కనిపించింది. అది సుజాత రాసినది. అందులో యిలా వున్నది.

"బొమ్మ తేలు అయినందుకు చాలా సంతోషించి వుంటావు! తేలులా కనిపించి కుట్టకపోతే ఫరవాలేదు కాని, వాన పాములా కనిపించి విషం కక్కితేనే ప్రమాదం. నిన్న నీవు దొంగలా కనిపించి హాని చేయలేదు.. ఈరోజు ఈ ఇంటికి కాబోయే అల్లుడివయే అవకాశం వుండీ,

నగలు దొంగిలించుకు పోతున్నావు. నా తండ్రికి నచ్చినా, నీ లాంటి మనిషి భర్త కాకుండా పారిపోతున్నందుకు ఆనందిస్తున్నాను."

ఉత్తరం చదివి మురళి దిగాలుపడిపోయాడు. సుజాతను పెళ్ళాడి, హాయిగా ఉద్యోగం చేసుకుంటూ సుఖంగా బతకవలసిన తను, యిలా దొంగలా జీవించ తలచినందుకు అసహ్యపడ్డాడు. వెంటనే పోయి, నగలు సుజాతకు యిచ్చి, ఆమెను క్షమాపణ కోరి తన దారిన తాను వెళ్ళిపోదలిచాడు.

మురళి తిరిగి యింటిలోకి వస్తూండగా, మంచినీళ్ళ కోసం వంటగదిలోకి వచ్చిన సుజాత తండ్రి, అతణ్ణి చూసి అనుమానంగా, "ఇంత రాత్రివేళ నగలపెట్టె తీసుకుని ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు.

మురళి జవాబు చెప్పేందుకు తత్తర పడుతూండగా సుజాత వచ్చి, "నా చేతి గాజులు గుచ్చుకుంటూంటే, వాటిని నగల పెట్టెలో దాద్దామనుకున్నాను, నాన్నా! అయితే అందులోకి ఎలాచేరిందో ఒక తేలు చేరింది. దాన్ని చంపిరావడానికి మురళి నగలపెట్టె తీసుకుని బయటికి వెళ్లాడు" అన్నది.

తండ్రి అటు వెళ్ళగానే ఆమె మురళితో "అలా దిక్కులు చూస్తావేం? లోపలికిరా. తేలును పూర్తిగా చంపేశావా? దేన్నయినా సగం, సగం చంపడం మహా పాపం" అన్నది నవ్వుతూ.

సుజాత తనలోని దొంగబుద్ధి అనే తేలును గురించి అడుగుతున్నదని గ్రహించిన మురళి ఆమె తనను క్షమించినందుకు ఎంతగానో సంతోషించాడు.

# * బావ-మరదలు *



కొట్టు కట్టేసి ఇంటికి వచ్చిన సుబ్బిశెట్టి, ముందు గదిలో వున్న పెట్టెను చూసి, "మళ్ళీ ఎవరు దిగారు తేరగా తిని పోవడానికి?" అని చిరాకుగా భార్యను అడిగాడు.

"కాస్త చిన్నగా మాట్లాడండి. నన్ను చూడాలనిపించి, మా చెల్లెలు వచ్చింది. పెరట్లో స్నానం చేస్తున్నది." అన్నది అతడి భార్య పార్వతి.

సుబ్బిశెట్టి పెద్దగా నవ్వి, "నీ అంత అనాకారిని, పని గట్టుకుని చూడవచ్చే వారు కూడా వున్నారన్న మాట!" అన్నాడు.

పార్వతి మనసు చివుక్కుమన్నది. పెద్ద కట్నం తీసుకుని సుబ్బిశెట్టి ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఆ రోజు నుంచి అనాకారి అని వేలెత్తి చూపుతూ, ఆమె మనసు గాయపరుస్తానే వున్నాడు. స్వతహాగా సాధువయిన పార్వతి, ఆ బాధను ఎంతో కాలంగా తనలోనే దిగమింగుకుంటున్నది.

ఆమె భర్తకు మంచినీళ్ళు అందిస్తూ, "గుర్తుంచుకుని, రేపు ఒక చీర తీసుకురండి," అన్నది.

"కొత్త చీరా! ఎందుకూ?" అన్నాడు సుబ్బిశెట్టి ఆశ్చర్యపోతూ.

"నా కోసం కాదండీ, మా చెల్లెలి కోసం. రాకరాక వచ్చింది కదా!" అన్నది పార్వతి.

"ఇది మరీ బావుంది! మీ వైపు వాళ్ళకక్కూడా చీరెలూ, సారెలూ పెట్టాలని ముందే చెప్పివుంటే, మీ నాన్న దగ్గిర మరి కాస్త కట్నం గుంజి వుండేవాణ్ణి" అన్నాడు శెట్టి నిర్మొహమాటంగా.

అంతలో స్నానం చేసి మరదలు లక్ష్మి అక్కడికి రావటం చూస్తూనే శెట్టి నవ్వుముఖం పెట్టి, "ఇంత కాలానికా రావడం? కనీసం మీ అక్కనైనా చూడాలనిపించలేదా?" అన్నాడు.

"ఎక్కడ బావా, చదువుతో సరిపోతున్నది" అన్నది లక్ష్మి నవ్వుతూ.

"అదీ నిజమే అనుకో. కాని, రాకరాక యిలాంటి సమయంలో వచ్చావేమిటి? ఊరంతా ముసుగుదొంగల భయంతో అట్టుడికిపోతున్నది. దారిలో ఎవరైనా నిన్ను అటకాయించివుంటే, ఏమయేది?" అన్నాడు శెట్టి.

"వాళ్ళకు నీ పేరు చెప్పి వుండేదాన్ని. కాళ్ళమీద పడి క్షమాపణ కోరివుండే వాళ్ళు," అంటూ విరగబడి నవ్వింది లక్ష్మి. పెళ్ళినాడు సుబ్బిశెట్టి తన ధైర్యసాహసాలను గురించి ఎన్నో కల్పిత కథలు చెప్పాడు. లక్ష్మి అవేవీ మరిచిపోలేదు.

"నువ్వన్నమాటా, నిజమేలే!" అంటూ శెట్టి ఒక వెర్రినవ్వు నవ్వాడు.

ఆ సమయంలో రంగన్న అనే అతను వచ్చి, సుబ్బిశెట్టికి వందరూపాయల మూట ఇచ్చి వెళ్ళాడు. అతను రెండు సంవత్సరాల క్రితం శెట్టి దగ్గిర అప్పుచేసి, అది తీర్చకుండానే ఊరువదలి పారిపోయాడు. అయితే, తరవాత రంగన్న పట్నంలో ఉద్యోగం సంపాయించి అనుకోకుండా ఆ రోజున వచ్చి పాత బాకీ తీర్చాడు.

సుబ్బిశెట్టి భార్యను పిలిచి, డబ్బుసంచీ ఆమె చేతికిచ్చి, ఇనప్పెట్టెలో దాయమన్నాడు.

పార్వతి అతణ్ణి లోపలికి పిలిచి, "రాదనుకున్న డబ్బు వచ్చింది కదా? ఒక చీర కొనుక్కురండి" అంటూ భర్తను బతిమాలింది.

"ఇంకా నయం! ఇనప్పెట్టె తలుపు మూసెయ్యి" అంటూ శెట్టి, భార్యను కసిరాడు.

పార్వతి మరి మాట్లాడలేదు. తరవాత ముగ్గురూ భోజనాలు చేశారు.

పార్వతి కంచాలు ఎత్తుతూ, "దొంగల భయం కదా. ఎంగిలి కంచాలు కూడా వంటగదిలోనే వుంచుకోవాల్సి వస్తున్నది." అన్నది చెల్లెలితో.

"అదేమిటి అక్కా! బావ బయట కాపలా పడుకోవడం లేదూ? ఆయన పెరట్లో పడుకుంటే, ఏ దొంగకు మాత్రం గోడదూకి లోపలికి రావడానికి గుండె వుంటుంది, అవునా బావా?" అన్నది లక్ష్మి.

"మరే, మరే!" అంటూ నీళ్ళు నమిలాడు శెట్టి. ఆరుబయట పడుకోవడం అన్న ఊహ రాగానే అతడికి కాళ్ళు వణకడం ప్రారంభమయింది.

లక్ష్మి స్వయంగా ఎంగిలి కంచాలు బావి పళ్ళెంలో పెట్టి వచ్చి, "భయం లేదులే, అక్కా! బావ పెరట్లో పడుకుంటాడు" అన్నది.

పార్వతికి భర్త పిరికితనం తెలుసు. ఆమె, "ఆయన ఎలా పడుకుంటారే, ఆయనకి..." అంటూ ఏమో చెప్పబోయింది.

సుబ్బిశెట్టి చప్పున కల్పించుకుని, "నాకేం భయమనుకుంటున్నారా? దుడ్డుకర్ర మంచం కింద పెట్టుకుని పడుకుంటాను. ఏ దొంగ వెధవయినా వచ్చాడో, బుర్ర బద్దలు కొట్టేస్తాను, నా మంచం పెరట్లో వేసెయ్యి." అన్నాడు బింకంగా.

పార్వతి భర్తకు పెరట్లో మంచం వేసింది. శెట్టి మంచం కింద లావుపాటి దుడ్డుకర్ర పెట్టుకున్నాడు. అక్కా చెల్లెళ్ళు తలుపులు మూసుకుని లోపల పడుకున్నారు. సుబ్బిశెట్టి భయంతో వణికి పోతూ, అర్ధరాత్రి వరకూ కన్ను మూయలేదు. తరవాత చిన్న కునుకుపట్టింది. అంతలో ఎవరో వీపు తట్టినట్లయి మెలుకువ వచ్చింది.

ఎదురుగా ముసుగుదొంగ! అతడి చేతిలో మెరుస్తున్న కత్తి. శెట్టి గుడ్లు తేలవేసి, నోటమాట రాక, చేతితో మంచం కిందికి సౌంజ్ఞ చేశాడు. దొంగ మంచం కింద వున్న దుడ్డుకర్ర పైకి తీసి, "నన్ను కొట్టాలనే, యీ దుడ్డుకర్ర యిక్కడ దాచావన్నమాట?" అంటూ కత్తి పైకెత్తాడు.

శెట్టి ఎలాగో గొంతు పెగుల్చుకుని, "ఆ కత్తి చూస్తే, నాకు నోటమాట రావడం లేదు. దాన్ని మొలలో దాచి, దుడ్డుకర్ర చేతిలో వుంచుకోండి," అన్నాడు నీరసంగా.

"మాటలతో కాలయాపన చెయ్యకు, జాగ్రత్త! ముందు తలుపులు తెరిపించు. నాకు డబ్బు కావాలి." అంటూ దొంగ కత్తి ఝుళిపించాడు.

"లోపల ఆడవాళ్ళున్నారు నా పరువు పోతుంది, బావి పళ్ళెంలో కంచాలున్నాయి అవి పట్టుకుపోండి" అన్నాడు శెట్టి.

దొంగ గట్టిగా పళ్ళుకొరికి, "మీ ఎంగిలి కంచాలు నన్ను మోసుకుపొమ్మంటావా? మళ్ళీ నోరెత్తావంటే, నిలువుగా చీల్చెయ్యగలను!" అన్నాడు.

"కాస్త చిన్నగా మాట్లాడండి. లోపల నా భార్యే కాక, గుండెజబ్బు మనిషి నా మరదలు కూడా వున్నది." అంటూ శెట్టి పోయి కిటికీలోంచి "పార్వతీ! పార్వతీ!" అని మెల్లిగా పిలిచాడు.

పార్వతి కళ్ళు నులుముకుంటూ వచ్చి, "భయం వేస్తున్నదా? లోపలికి వస్తారా?" అని అడిగింది.

"నీ మొహం, ఇవతల పెద్దమనిషి నిలబడి వున్నాడు. ఆయనకు అవసరంగా డబ్బు కావాలిట. సాయంత్రం రంగన్న యిచ్చిపోయిన డబ్బేగా మన దగ్గిరున్నది! పోయి, త్వరగా యిలా పట్టుకురా," అన్నాడు శెట్టి.

పార్వతి ఆశ్చర్యంగా భర్త ముఖం కేసి చూసి, డబ్బు సంచి తెచ్చి యిచ్చింది. సుబ్బిశెట్టి దాన్ని దొంగ చేతిలో పెట్టాడు. దొంగ మరి మాట్లాడకుండా చీకట్లోకి జారుకున్నాడు. సుబ్బిశెట్టికి యిక నిద్రపట్టలేదు. డబ్బు పోయినందుకు కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ, తెల్లవారే దాకా జాగరణ చేశాడు.

మర్నాడు లక్ష్మి, "బావా నేను సాయంత్రం వెళ్ళిపోతున్నాను. వచ్చేటప్పుడు అక్క కోసం చీర తెద్దామనుకున్నాను గాని; వీలుకాలేదు. డబ్బిస్తాను, ఒక చీర కొనుక్కురా," అంటూ డబ్బు సంచీ శెట్టికి యిచ్చింది.

ఆ సంచీ చూసి శెట్టి ఉలిక్కిపడ్డాడు. దాన్ని రాత్రి అతను స్వయంగా దొంగ చేతికిచ్చాడు.

లక్ష్మి చిన్నగా నవ్వి, "అలా చూస్తావేం, బావా? దొంగకిచ్చిన సంచీ నా చేతిలోకి ఎలా వచ్చిందనా? ఆ దొంగను నేనేగా! దుప్పటి చుట్టబెట్టుకుని, పళ్ళు కోసుకునే కత్తి తీసుకుని, గొంతు మార్చి బెదిరించాను. నువ్వు పిరికివాడివే కాదు, లోభివి కూడా. స్నానం చేసివచ్చి, పక్కగదిలో వుండి, నీకూ, అక్కకూ జరిగిన సంభాషణ అంతా విన్నాను. అక్క అనాకారే! అది ఆవిడ తప్పు కాదు. బాహ్యంగా మారడం ఎవరికీ సాధ్యం కాదు. కాని, మానసికంగా మారేందుకు ఎవరైనా ప్రయత్నించవచ్చు. ఇప్పటికైనా, నీ కుళ్ళు బుద్ధి నుంచి బయటపడి, తాళికట్టిన భార్యను సూటీపోటీ మాటలతో హింసపెట్టడం మానుకుంటావని నమ్ముతున్నాను," అన్నది.

సుబ్బిశెట్టి వెలవెల పోయి, డబ్బు సంచీని విసురుగా లక్ష్మి మీదికి గిరవాటు వేసి, వీధిలోకి పోయాడు.

"మీ బావకు కోపం వచ్చింది. ఇంత నాటకం ఎందుకాడావు?" అంటూ పార్వతి భయపడిపోయింది.

అయితే కొద్ది సేపట్లోనే సుబ్బిశెట్టి రెండు ఖరీదైన చీరలు తీసుకుని, నవ్వు ముఖంతో తిరిగివచ్చాడు. పార్వతి పట్టరాని సంతోషంతో చెల్లెలి భుజం తట్టి, "మీ బావ మారిపోయాడు. ఏడాది కాలంలో ఏమాత్రం మార్చలేని మనిషిని మరదలు ఒక్క రోజులో మార్చేసింది! అన్నది".

# * స్నేహధర్మం *



భూపతికి బోలెడంత పొలమూ, పెద్ద ఇల్లూ ఉన్నాయి. అతని ఏక పుత్రుడు గజపతి.

ఒకసారి తండ్రి కొడుకు లిద్దరూ రాజధానిలో జరిగే ఉత్సవాలు చూడడానికి వెళ్ళారు. రెండు రోజులపాటు నగర వైభవాన్ని, ఉత్సవాల సంరంభాన్నీ చూసి, మూడోరోజు ఒక పెద్ద భవంతి ముందుకు వచ్చి, నగరంలో అలాటి భవంతి మరొకటి లేదనుకున్నారు. అది ఎవరిదని దారినపోయేవాణ్ణి అడిగితే, మాణిక్యవర్మ అనే ధనవంతుడిదని తెలిసింది.

నాతో బంగారం పంచుకున్న మాణిక్యవర్మ కాడుగదు! అని భూపతి గొణిగాడు.

గజపతికి ఆ మాట వినపడనే వినపడింది. "ఎవరు నీతో బంగారం పంచుకున్న మాణిక్యవర్మ?" అని అతను తండ్రిని అడిగాడు. భూపతి ఇలా చెప్పాడు.

చిన్నతనంలో భూపతి బొత్తిగా దిక్కు లేనివాడు. ఎవరికి పడితే వారికి చిల్లరపనులు చేసిపెట్టి, వాళ్ళిచ్చే డబ్బులతో పొట్టపోసుకునేవాడు. మాణిక్యవర్మ భూపతికి మంచి స్నేహితుడు. ఊరి చివర పాడుపడిన భవనం ఒకటి ఉండేది. అది ఒక జమీందారుది; పిడుగుపడి కూలిపోయింది. జమీందారు కుటుంబం అందరూ చచ్చిపోయారు. ఒక్క జమీందారు తండ్రి మాత్రం బతికాడు. అతను ఆ సమయానికి ఊళ్ళో లేడు. తిరిగివచ్చి జరిగినది చూడగానే అతనికి మతిపోయింది.

ఆ వృద్ధుడు తరవాత కొంతకాలం బతికాడు; ఎప్పుడైనా ఊళ్ళోకి వచ్చి, కుర్రవాళ్ళతో, "మీకు బంగారం కావాలిరా?" అని గట్టిగా కేకలు పెట్టేవాడు. అతన్ని చూసి కుర్రవాళ్ళు భయపడేవాళ్ళు. ఒక్కోసారి దూరంనుంచి అతనిమీద రాళ్లు వేసేవాళ్లు.

భూపతి, మాణిక్యవర్మ మాత్రం ఆ పిచ్చివాడి పట్ల స్నేహంగా ఉండేవాళ్ళు. అప్పుడప్పుడూ ఆ కూలిపోయిన భవనానికి పోయి, ముసలివాడితో కబుర్లు చెప్పేవాళ్ళు. ఒకరోజు వాళ్లు వెళ్లేసరికి, ముసలివాడు చావు బతుకుల్లో ఉన్నాడు. ఇద్దరూ యింత నీరు తెచ్చి అతని గొంతులో పోశారు.

ముసలివాడు గుటకలు వేసి, "పిల్లలూ, పెరట్లో వేపచెట్టు మొదట్లో బంగారం ఉంది, తవ్వి తీసుకోండి''అని ప్రాణం వదిలాడు.

కొద్ది రోజులు గడవనిచ్చి, భూపతి, మాణిక్యవర్మ చెట్టు మొదట్లో కాస్త కాస్తగా తవ్వసాగారు. పదిరోజులు తవ్వినాక, పాతకాలపు పెట్టె కనబడింది. దాని నిండా బంగారు నగలున్నాయి. వాటిని స్నేహితులిద్దరూ సమంగా పంచుకున్నారు.

తనవంతు బంగారంతో మాణిక్యవర్మ నగరంలో వ్యాపారం చేయ నిశ్చయించాడు. భూపతి పల్లెప్రాంతానికి పోయి భూములు కొని, భూస్వామిగా బతకాలని నిశ్చయించాడు. స్నేహితులిద్దరు విడిపోయి, తిరిగి కలుసుకోలేదు.

తాము చూసిన ఇల్లు ఆ మాణిక్యవర్మదేనని త్వరగానే తెలిసిపోయింది. మాణిక్యవర్మ భూపతిని చూసి గుర్తుపట్టి, నౌకరును పంపి లోపలికి పిలిపించాడు.

తండ్రి కొడుకులిద్దరూ ఇల్లంతా తిరిగి చూసి, అమిత ఆశ్చర్యపడ్డారు. గజపతికి ఆ ఇంటి వైభవం చూసినాక తండ్రిమీద చాలా కోపం వచ్చింది. "నాన్నా, నువు నాకు తీరని అన్యాయం చేశావు. నువు కూడా వ్యాపారం చేసి ఉంటే మనం కూడా ఇంత హాయిగానూ ఉందుము. మన జీవితం తలుచుకుంటే రోత పుడుతున్నది," అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

కొడుకు చేత అంత మాటనిపించుకున్నందుకు భూపతి బాధపడ్డాడు. మాణిక్యవర్మ అతన్ని చూసి, "అలా ఉన్నావేం?" అని అడిగితే భూపతి తన కొడుకు అన్నమాట చెప్పాడు.

"తెలియనితనం! నువ్వేమీ బాధపడకు," అని మాణిక్యవర్మ భూపతికి భోజనం పెట్టించి, విశ్రాంతి సదుపాయం చేశాడు.

కొద్దిసేపటికి గజపతి ఎర్రబడిన కళ్ళతో, చెరిగిన జుట్టుతో, ఇంటికి తిరిగి వచ్చాడు.

మాణిక్యవర్మ అతన్ని కూడా భోజనానికి కూర్చోబెట్టి, అలా ఉన్నావేమని అడిగాడు.

"మా నాన్న నాకు తీరని అన్యాయం చేశాడు. మీతోపాటే ఆయన కూడా నగరంలో వ్యాపారం చేసి ఉంటే, మేం కూడా మీలాగే హాయిగా ఉండేవాళ్ళం." అన్నాడు గజపతి.

మాణిక్యవర్మ నవ్వి, "అలా ఎన్నటికీ అనుకోకు. మీ నాన్న చేసిన నిర్ణయం ముందు చూపుతో కూడినది. వ్యాపార మంటే జూదం. ఓడలు బళ్లు కావచ్చు, బళ్లు ఓడలు కావచ్చు. నావంతు బంగారంతో మా అన్నను కూడా వ్యాపారం చెయ్యమన్నాను, కాని అతనికి ఇష్టం లేకపోయింది. నా దగ్గిర ఉన్న బంగారంలో సగం తీసుకుని, ఓడ వ్యాపారం సాగించాడు. నడిసముద్రంలో ఓడ మునిగి, సరుకంతా పోయింది. నా దగ్గిర మరికొంత బంగారం తీసుకుని కలప వ్యాపారం సాగించాడు. అగ్ని ప్రమాదంలో అతని కలప అంతా కాలి బూడిద అయిపోయింది. నేను చేసిన వ్యాపారం బాగా కలిసి వచ్చింది. వ్యవసాయం అలాగా కాదు, వ్యాపారానికి స్వయం కృషికన్న అదృష్టం కలిసిరావటం ముఖ్యం. ఇవాళ కుబేరుడుగా ఉన్నవాడు రేపు బికారి కావచ్చు. వ్యాపారం చేసేవాడికి చింత తప్ప సంసార సుఖం కూడా ఉండదు. నీ జీవితంలో ఎలాటి సమస్యలూ లేవంటే అది మీ నాన్న చలవే!" అన్నాడు.

గజపతికి కను విప్పు కలిగింది. అతను తన అజ్ఞానానికి ఎంతగానో సిగ్గు పడ్డాడు.

మర్నాడు భూపతి మాణిక్యవర్మతో, "నువ్వు మావాడికి మీ అన్న గురించి చెప్పావుటగదా? ఎవరా అన్నయ్య? నే నెన్నడూ ఎరగనే?" అన్నాడు.

"నీ పట్ల స్నేహధర్మాన్ని బట్టి ఒక చిన్న కట్టుకథ అల్లి చెప్పాను. మీవాడి మనసు మారినట్టే ఉంది" అన్నాడు మాణిక్యవర్మ.

# * అసలైన ఆభరణం *



రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాన, హఠాత్తుగా పెద్ద వర్షం ప్రారంభం కావడంతో, గంగాధరం వీధి వాకిలి  తలుపుతో పాటు కిటికీలు కూడా మూసి వచ్చాడు. గాలి హోరుకూ, ఉరుముల శబ్దానికీ అతడి ఆరేళ్ళ కూతురు  విద్య భయపడి పోయి తల్లిని గట్టిగా చేర్చి పట్టుకుని కూర్చున్నది.

"భయపడకే, తల్లీ!" అంటూ గంగాధరం కూతుర్ని ఎత్తుకున్నాడు. అంతలో ఎవరో వీధి తలుపు తట్టిన శబ్దమైంది.

గంగాధరం వెళ్ళి తలుపు తీశాడు. వర్షంలో బాగా తడిసి ముద్దయిపోయిన అతడి మిత్రుడు

సత్యంతోపాటు, మరొక మనిషి లోపలికి వచ్చాడు. సత్యాన్ని చూస్తూనే విద్య భయంపోయి చిన్నగా నవ్వింది. సత్యం, గంగాధరం చిన్ననాటి స్నేహితుడు. అతడికి పట్నంలో ఉద్యోగం. గంగాధరం ఉత్సాహంగా భార్యను, "గాయత్రీ, యిదుగో మీ అన్నయ్య వచ్చాడు!" అంటూ కేకవేశాడు. వాళ్ళు తడిసి వుండడం చూసి గాయత్రి వాళ్ళకు పొడిబట్టలు తెచ్చి యిచ్చింది.

సత్యం బట్టలు మార్చుకుని, విద్యను తన చేతుల్లోకి తీసుకుంటూ, "పనిపడి రంగాపురం వెళుతున్నాను; దారిలో యీ వర్షం! అనుకోకుండా కోదండం కలిశాడు. మా పట్నం వాడే," అంటూ తనతో వచ్చిన మనిషిని గంగాధరానికి పరిచయం చేశాడు.

గాయత్రి అతిధులకు అప్పటికప్పుడు వేడివేడిగా వంట తయారు చేసింది. వాళ్ళు భోజనం చేయగానే, వీధిగదిలో యిద్దరికీ పడకలు సిద్ధం చేసింది.

"నేను, మామయ్య పక్కనే కథలు వింటూ పడుకుంటాను," అన్నది విద్య.

"ఇప్పటికే బాగా పొద్దుపోయింది. మామయ్య ప్రయాణ బడలికలో వున్నాడు. ఇప్పుడా కథలు!" అంటూ గాయత్రి కూతురును కసురుకున్నది.

"మరేం ఫర్వాలేదు, చెల్లీ! విద్యకు నిద్రపట్టేవరకూ కథలు చెబుతాను," అన్నాడు సత్యం.

విద్య సత్యం పక్కనే పడుకుని, అతడు చెప్పే కథలు వింటూ గంట తరవాత నిద్రపోయింది. సత్యం కూడా బడలిక కొద్దీ, ఆ వెంటనే నిద్రపోయాడు. అతడికి తిరిగి మెలకువ వచ్చేసరికి తెల్లవార వస్తున్నది.

అప్పటికే నిద్ర లేచి వున్న కోదండం, సత్యాన్ని, "నువ్వు మరి కొంతసేపు వుంటావా, నాతోపాటు బయలుదేరి వస్తావా?" అని అడిగాడు.

విద్యనిద్రలేస్తే, యిక ఆ పూటకు అక్కడి నుంచి తనను కదలనీయదని ఎరిగి వున్న సత్యం, గంగాధరం అతడి భార్యా భోజనం చేసి వెళ్ళమని బలవంతం చేసినా వినకుండా, కోదండంతో పాటు బయలుదేరాడు.

పొద్దెక్కి నిద్రలేస్తూనే విద్య, "సత్యం మామయ్య ఏడీ?" అంటూ ఇల్లంతా వెతికి చూసింది.

గాయత్రి కూతుర్ని స్నానం చేయించడానికి పెరట్లోకి తీసుకుపోతూ, "మామయ్య నీకు బొమ్మలు తెస్తానని బజారుకు వెళ్ళాడు." అన్నది.

ఆమె కూతురుకు నీళ్ళు పోస్తూ బోసి మెడకేసి చూసి నిర్ఘాంతపోయింది. విద్య మెడలో అత్తగారు ఎంతో ప్రేమతో చేయించిన మూడు తులాల బంగారు గొలుసు లేదు! కిందటి సాయంత్రమే విద్య పేచీ పెడితే, పెట్టెలోంచి గొలుసు తీసి ఆమె మెడలో వేసింది.

గాయత్రి గబగబా ముందుగదిలోకి వచ్చి, విద్య పడుకున్న పక్క అంతా దులిపి చూసింది. గొలుసు జాడలేదు! గాయత్రికి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. అత్తగారు తన పెళ్ళినాటి గాజులు

కరిగించి ఎంతో అపురూపంగా చేయించిన గొలుసు; అది పోయిందంటే ఆమె ఎంతగా బాధపడుతుంది! ఒక వారం రోజుల్లో, ముఖ్యంగా మనమరాలిని చూసేందుకు వస్తున్నట్లు ఉత్తరం కూడా రాసింది.

భార్య నుంచి గొలుసు కనిపించడం లేదని విని, గంగాధరం కూడా రెండు మూడుసార్లు ఇల్లంతా వెతికాడు. ప్రయోజనం కలగలేదు.

గాయత్రి దిగులు పడిపోతూ, "రాత్రికి రాత్రి గొలుసు మాయం కావడం విడ్డూరంగా వుంది. ఒకవేళ అన్నయ్య, నిద్రలో పిల్ల మెడకు గుచ్చుకుంటుందని, దాన్ని తీసి దాచాడేమో!" అన్నది.

గంగాధరాని క్కూడా, చివరికి యీ ఒక్క ఆశే మిగిలింది. రెండు రోజుల తర్వాత తిరుగు ప్రయాణంలో విద్యకోసం బొమ్మలు తీసుకుని సత్యం మళ్లీ వచ్చాడు.

గంగాధరం సత్యానికి జరిగింది చెప్పి, "గొలుసేమైనా నువ్వు తీసి దాచావేమో అనుకున్నాం," అన్నాడు.

సత్యం కొంచెంసేపు ఆలోచించి, "తప్పకుండా యీ పని ఆ కోదండం గాడిదే అయుంటుంది!" అన్నాడు.

"అతనలాంటి వాడా?" అన్నాడు గంగాధరం ఆశ్చర్యపోతూ.

"అతడితో నాకు కొద్దిపాటి ముఖ పరిచయం తప్ప, అంతగా స్నేహమంటూ లేదు. నువ్వు, నాతో బయలుదేరు. అతడింటికి వెళ్ళి అడుగుదాం. అవసరం అయితే బెదిరించి చూద్దాం." అన్నాడు సత్యం.

ఇద్దరూ పట్నం చేరేసరికి మధ్యాహ్నం అయింది. భోజనం చేసి విశ్రాంతి తీసుకుని, సాయంత్రం కోదండం ఇంటికి వెళ్ళారు. ఆ సమయంలో కోదండం ఇంటి ముందున్న కూరపాదులకు నీళ్లు పోస్తున్నాడు. అతడు సత్యం, గంగాధరాలను చూస్తూనే ఒక క్షణం నివ్వెరపడి, అంతలోనే సర్దుకుని, "రండి, రండి అనుకోని అతిథులు!" అన్నాడు.

సత్యం అతడితో "ఇక్కడ రక్షక భటుల అధికారి గంగాధరం పిన్ని కొడుకు. గంగాధరం వాళ్ళింట్లో శుభకార్యానికి వచ్చాడు. నిన్ను చూస్తానంటే తీసుకువచ్చాను." అన్నాడు.

కోదండం వాళ్ళను ముందుగదిలో కూర్చోబెట్టి, లోపలికి పోయి భార్యను, "అమ్మాయి ఎక్కడ?" అని అడిగాడు.

"ఆడుకోవడానికి వెళ్ళింది" అని భార్య చెప్పగానే, కోదండం "నువ్వు వెంటనే పెరటిదోవన వెళ్ళి అమ్మాయి మెడలో వున్న గొలుసు తీసుకురా," అన్నాడు.

"అంత మునిగిపోయిందేమిటి? అమ్మాయి చీకటి పడుతూనే తిరిగి వస్తుంది గదా," అన్నది భార్య.

"ముందు చెప్పిన పని చెయ్యి," అంటూ కోదండం భార్యను కసురుకున్నాడు.

ఆమె పావుగంట గడిచీ గడవక ముందే, శోకాలు పెడుతూ తిరిగి వచ్చి, "కొంప మునిగింది! వీధిలో ఆడుకుంటున్న పిల్లలు చెప్పారు. ఎవడో పెద్ద గడ్డంవాడు మిఠాయి కొనిపెడతానని అమ్మాయిని తీసుకుపోయాడట. వాడు అమ్మాయి మెడలో వున్న గొలుసు దొంగిలించేందుకే అలా చేసి వుంటాడు." అన్నది.

గొలుసు మాట వింటూనే కోదండం వెలవెలపోయి, భార్యను వారించబోయాడు గాని, ఆమె దుఃఖంలో అది గమనించలేదు.

సత్యం కల్పించుకుని, "పిల్లలను వీధిలోకి మెడలో బంగారం గొలుసుతో పోనివ్వడం కోరి ప్రమాదం తెచ్చుకోవడమే! ఆ గొలుసు ఎలా వుంటుందో చెప్పి వెంటనే రక్షకభటులకు ఫిర్యాదు చేద్దాం," అన్నాడు.

ఈ ఫిర్యాదు మాట వింటూనే కోదండానికి వణుకు పుట్టింది. తను విద్య మెడలోంచి గొలుసు దొంగిలించిన సంగతి ఎలాగూ బయటపడుతుంది. ఆ సంగతి రక్షకభటుల దగ్గిర తెలియడం అంటే, తనకు ఖైదు తప్పదు. కోదండం యిలా ఆలోచించి, గంగాధరం చేతులు రెండూ పట్టుకుని వణుకుతున్న గొంతుతో, "మీరు నన్ను క్షమించాలి! మా అమ్మాయి మెడలోని గొలుసు మీ విద్యది, మొన్న రాత్రి దొంగిలించాను. మా ఆవిడ అమ్మాయికి గొలుసు చేయించమని రోజూ సాధిస్తూందేది, నాకా ఆ స్థోమతలేదు. ఫిర్యాదు చేయకండి, పరువు నాకు ప్రాణంతో సమానం," అన్నాడు.

గంగాధరం ఎంతో సౌమ్యంగా "చూడు కోదండం! పెళ్ళానికి నచ్చ చెప్పలేనప్పుడు, యిలాంటి అనర్థాలు జరుగుతుంటాయి. పిల్లలకు అసలైన ఆభరణం విద్య. అంతేకాని, చిన్నతనం నుంచీ వాళ్ళకు బంగారం మీద మోజు కలిగేలా చేయడం అవివేకం. ముందు మీ అమ్మాయి ఏమైందో వెదుకుదాం పద," అన్నాడు.

ఇంతలో మిఠాయి పొట్లంతో కోదండం కూతురు తిరిగి వచ్చింది. ఆ పిల్ల మెడలో విద్య బంగారు గొలుసు కనబడగానే కోదండం భార్య సంతోషంతో, "ఎక్కడికి వెళ్ళావే తల్లీ? గడ్డం వాడెవడో నిన్ను ఎత్తుకు పోయాడనుకున్నాం," అన్నది.

కోదండం కూతురు మిఠాయి పొట్లం విప్పుతూ, "ఆ మామయ్య కొత్తగా యీ ఊరుకు ఉద్యోగం పని మీద వచ్చాడట. నేను అచ్చం వాళ్ళ అమ్మాయిలా వుంటానన్నాడు. కాసేపు నా మాటలు విని, మిఠాయి కొట్టు దగ్గిరకు తీసుకుపోయి, మిఠాయి కొనిపెట్టాడు." అన్నది.

కోదండం భార్య కూతురు మెడలోని గొలుసు తీసి గంగాధరానికిస్తూ, "నా మూర్ఖత్వం, ఆయన్ని దొంగగా చేస్తుందనుకోలేదు. 'పిల్లలకు బంగారం కాదు, బంగారంలాంటి భవిష్యత్తు కోసం చదువు ముఖ్యం' అన్న సంగతి, మీ వల్ల తెలుసుకున్నాను," అన్నది.

గంగాధరం గొలుసును జేబులో వేసుకుని, కోదండం కూతురును ఆప్యాయంగా దగ్గిరకు తీసుకుంటూ, "దేవుడి దయవల్ల ఎవరి సొత్తు వారికి దక్కింది!" అన్నాడు.

# * మాట పట్టింపు *



వీధి కుక్కల అరుపులకు జానకయ్యకు మెలుకువ వచ్చింది. అప్పటికి అర్ధరాత్రి దాటి వుంటుంది. ఎందుకైనా మంచిదని జానకయ్య తలుపులు తీసుకుని యివతలకి వచ్చాడు. చీకటిగా వున్న వీధిలో, గాడిదను చూసి కుక్కలు మొరుగుతున్నవి. అవతల చలి విపరీతంగా వుంది. అతడు కుక్కలను అదిలించి, లోపలికి రాబోతూ, అరుగు మీద ఎవరో ముడిచి పెట్టుకుని పడుకుని వుండడం చూశాడు.

"ఎవరు వారు?" అన్నాడు జానకయ్య. ఆ వైపు నుంచి జవాబు లేదు. జానకయ్య ఆ మనిషిని తట్టి చూశాడు. అతను చలికి గడగడలాడి పోతున్నాడు; ఒళ్ళు జ్వరంతో కాలిపోతున్నది.

"చలి ఎక్కువగా వుంది. ఒంట్లో బావున్నట్టు లేదు. లోపలికి వచ్చి పడుకో," అన్నాడు జానకయ్య.

అతను అతి కష్టం మీద లేచి, జానకయ్యకు చేతులు జోడించాడు. జానకయ్య అతనికి చేతి ఆసరా యిచ్చి, లోపలికి తీసుకువెళ్ళాడు. తరవాత చాప పరిచి, కంబళి కప్పి పడుకోబెట్టాడు. ఆ మనిషి మరు క్షణం నిద్రలోకి జారుకున్నాడు. అతన్ని గురించిన ఆలోచనలతో, జానకయ్యకు చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు.

ఎవరో తలుపు దడదడ బాదుతూండగా అతడికి మెలుకువ వచ్చింది. ఆ సరికే బారెడు ప్రొద్దెక్కింది. ఆ వచ్చింది అతడి భార్య, రత్నం. ఆమె, ఆ క్రితం రాత్రి అదే ఊళ్ళో బంధువుల పెళ్ళికి హాజరయి, తెల్లవారుతూనే ఇంటికి వచ్చింది.

"ఇంత పొద్దెక్కే దాకా పడుకున్నావేం?" అంటూ లోపలికి వచ్చిన ఆమె, చాప మీద కంబళి కప్పుకుని పడుకుని వున్న మనిషిని చూసి, "ఎవరో వచ్చినట్టున్నారే! ఎవరు?" అని భర్తను అడిగింది.

"ఏమో, ఎవరో!" అని జానకయ్య జరిగిందంతా చెప్పాడు.

"అయ్యో పాపం! వేడి పాలిస్తే కాస్త తేరుకుంటాడు. మీరు అతన్ని లేపి మొహం కడుక్కోమని చెప్పండి." అంటూ ఆమె హడావిడిగా వంటగదిలోకి వెళ్ళిపోయింది.

జానకయ్య ఆ మనిషిని లేపుదామని ఒంటి మీద చెయ్యి వేసి, ఉలిక్కి పడ్డాడు. రాత్రి నిప్పులా కాలిన అతని ఒళ్ళు, యిప్పుడు, మంచులా చల్లగా వున్నది.

"ఇతను పోయాడే!" అంటూ జానకయ్య ఒక వెర్రికేక పెట్టాడు.

వంట గదిలోంచి రత్నం పరుగు, పరుగున వచ్చి, "పోయాడా అయ్యో! ఇప్పుడేం చేద్దాం? అతని ఊరు ఏదో, అతని వాళ్ళు ఎక్కడ వున్నారో!" అంటూ లబలబలాడింది.

జానకయ్య ఆ మనిషి నడుం తడిమి చూశాడు. చేతికి గలగలలాడుతూ డబ్బు సంచీ తగిలింది. అతను ఆ సంచీ పైకి తీసి, కింద గుమ్మరించాడు. డబ్బుతో పాటు, ఒక ఉత్తరం కూడా కిందపడింది. అది, ఒక తల్లి కొడుక్కు రాసిన ఉత్తరం. అందులో యిలా వున్నది.

"బాబూ, నారాయణా! నీకీ మధ్య జ్వరం కాస్తున్నదని, మన ఊరు మనిషి ఒకరు, బజార్లో కనిపించి చెప్పాడు. ఇప్పుడు ఎలా వున్నది? ఇక్కడ నీ తమ్ముడి పరిస్థితి బాగాలేదు. కూతురు పెళ్ళికి మూడువేల రూపాయలు ఎలా తేగలనా అని, వాడి బెంగ. చాలా మంచి సంబంధం. ఈ సమయంలో మీరు పాతస్పర్థలూ, మాటపట్టింపులూ మర్చిపోవాలి. రాధ పెళ్ళికి నువ్వు డబ్బు సాయం చేయాలి. పెద్దవాడివి కనక, తమ్ముడి విషయంలో నువ్వే సర్దుకుపోవాలి.

ఈ ఉత్తరం అందగానే ఒంట్లో బావుంటే డబ్బు తీసుకుని బయలుదేరు. ఇక్కడ మేం

మరో ఇంటికి మారాం. కొత్త చిరునామా రాస్తున్నాను. ఈ ఉత్తరం వెంట తెచ్చుకుంటే, ఇల్లు తేలిగ్గా కనుక్కోవచ్చు."

జానకయ్యకి సంగతి అర్థమైపోయింది. అతడు భార్యతో, "పాపం, తమ్ముడి కూతురు పెళ్ళికి డబ్బు తీసుకుని బయలుదేరి, దారిలో పోయాడు. ఈ ఉత్తరం వెంట వుంచుకోవడం మేలే అయింది! మనకు కనీసం, ఆ తమ్ముడి చిరునామా అయినా తెలిసింది," అన్నాడు.

"మీరు వెంటనే బయలుదేరి ఆ ఊరు వెళ్ళండి. వాళ్ళకు ఉత్తరం, డబ్బూ యిచ్చేసి, సంగతి చెప్పి తీసుకురండి. మీరు వచ్చేదాకా నేను పెళ్ళివారి ఇంట్లోనే వుంటాను. ఇంటికి తాళం పెడదాం." అన్నది రత్నం.

అప్పటికప్పుడు భార్యాభర్తలు యింటికి తాళం పెట్టారు. జానకయ్య బాడుగ బండిలో రెండామడల దూరంలో వున్న నారాయణ తమ్ముడి ఊరికి బయలు దేరాడు. అతను ఆ ఊరు చేరేసరికి మధ్యాహ్నం అయింది. అతడికి ఇల్లు కనుక్కోవడం కష్టమేం కాలేదు. కాని లోపలికి వెళ్ళబోతున్న అతను, లోపలి నుంచి వచ్చే మాటలు విని, గుమ్మంలోనే ఆగిపోయాడు.

"అమ్మా! డబ్బెక్కడా దొరకలేదు. ఇక నేను చేయగలిగిందేమీ లేదు. పెళ్ళివారికి మరో సంబంధం చూసుకోమని చెప్పేస్తాను." అంటున్నారు ఎవరో, బహుశా తమ్ముడు కాబోలు!

"అదేం మాటరా! చక్కటి సంబంధం, డబ్బుకు వెనకాడి వదులుకుంటామా? మీ అన్నయ్యకు డబ్బు తెమ్మని ఉత్తరం రాశాను. తప్పకుండా డబ్బు తెస్తాడు." అంటున్నది తల్లి.

ఆ మాటకు తమ్ముడు పెద్ద గొంతుతో, "నాకు చెప్పకుండా ఉత్తరం ఎందుకు రాశావు? అన్నయ్య డబ్బు చచ్చినా నేను ముట్టను. ఆ డబ్బుతో నా కూతురి పెళ్ళి చేసేది లేదు" అన్నాడు.

"చిన్న మాటపట్టింపుతో, మీ అన్నదమ్ములు పదేళ్ళుగా మొహాలు చూసుకోలేదు. రాధ పెళ్ళిలో అయినా మీరు కలుసుకుంటారని యిన్నాళ్ళుగా ఆశపడ్డాను." అన్నది తల్లి, బొంగురుపోయిన గొంతుతో.

జానకయ్య తలుపు చప్పుడు చేసి, "నారాయణ తమ్ముడు గారి ఇల్లు యిదేనా?" అని కేకపెట్టాడు.

లోపలినుంచి నలభై ఏళ్ళ మనిషి తలుపు తెరిచి, "ఎవరు మీరు? లోపలికి రండి?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

జానకయ్య లోపలికి వెళ్ళి కుర్చీలో కూర్చుని, డబ్బుసంచీ బల్లమీద పెట్టి, ఉత్తరం తమ్ముడు చేతికి యిచ్చాడు. తమ్ముడు ఆ ఉత్తరం చదివి, "ఇది, మా అమ్మ అన్నయ్యకు రాసింది. తను రావడానికి మొహం చెల్లక, అన్నయ్య డబ్బు పంపివుంటాడు. ముందు ఆ డబ్బు సంచీ, నా కళ్ళముందు నుంచి తీసేయండి!" అన్నాడు జేవురించిన మొహంతో.

"మీ అన్నయ్య స్వయంగా వద్దామనుకున్నాడు. కాని రాలేకపోయాడు. మీరిద్దరూ కలుసుకోవడం మరి యీ జన్మలో జరగదు," అంటూ జరిగినదంతా చెప్పేశాడు జానకయ్య.

తల్లి ఘొల్లుమన్నది. ఒక క్షణం ఆగి తమ్ముడు అరచేతుల్లో మొహం దాచుకుని, "అన్నయ్యా, నన్ను క్షమించు!" అంటూ ఏడ్వసాగాడు.

ఆ ఏడుపు చూసి జానకయ్య ఏమాత్రం జాలిపడకుండా, "బతికున్న మనిషి విలువ తెలుసుకోవటం కష్టం. నీ మీద నీ అన్నకు ఎంత ప్రేమ లేకపోతే, ఒంట్లో బావుండకపోయినా, డబ్బు తీసుకుని బయలు దేరుతాడు? నువ్వు సోదర ప్రేమకు యిన్నాళ్ళూ దూరం అయావు. ఇప్పుడది కోరినా దొరకదు," అన్నాడు.

ఆ ఇంట శోకాలు విని ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు వచ్చారు. అంతలో, "ఏమిటిదంతా? ఏం జరిగింది?" అంటూ ఒక ఏభై ఏళ్ళ మనిషి అక్కడికొచ్చాడు.

అతణ్ణి చూస్తూనే తల్లీ, తమ్ముడూ ఏడ్పుమాని నిర్ఘాంతపోయారు. తమ్ముడు అతణ్ణి సమీపిస్తూ, "అన్నయ్యా, నువ్వు బతికే వున్నావా! నేను మూర్ఖుణ్ణి, నీ మంచి గుణం తెలుసుకోలేకపోయాను," అంటూ కాళ్ళు పట్టుకున్నాడు.

జానకయ్యకు ఆ వచ్చిన మనిషి తామింతవరకు చచ్చిపోయాడనుకునే నారాయణ అని అర్థమైపోయింది.

సంగతంతా తెలుసుకొని నారాయణ నవ్వి, "నేను డబ్బుతీసుకుని మొన్ననే బయలుదేరాను. రాధకు పట్టుచీర కొందామని పట్నం బజారుకు వెళ్ళాను. అక్కడ ఒక ముసలాడు, దిక్కులేనివాణ్ణి, బిచ్చం అంటూ వెంటపడ్డాడు. జాలిపడి డబ్బు మూటపైకి తీసి, వాడికి ఒక రూపాయి యిచ్చాను. నేను దుకాణంలో చీరలు చూస్తుండగా, వాడు నా వెనకే తచ్చాడు తూండడం, నాకు అనుమానం కలిగించింది. తీరా చీర తీసుకొని, డబ్బుకోసం చూసేసరికి, మొలలో దాచిన డబ్బు సంచీ లేదు. ముసలాడి కోసం తెగ వెతికాను. వాడు కనిపించలేదు. మళ్ళీ ఇంటికి వెళ్ళి డబ్బు తీసుకుని, బయలుదేరి యిక్కడికి వచ్చాను. మీ ఇంట్లో చచ్చిపోయింది. దొంగే అయుంటాడు." అన్నాడు జానకయ్యతో.

"ఆ దొంగ చచ్చి మేలు చేశాడు. అతడి పుణ్యమా అని, అన్నదమ్ములు మళ్ళీ కలుసుకున్నారు." అన్నది తల్లి సంతోషంగా.

"ఇక నేను వెళతాను. ఇంటివద్ద జరగవలసిన పని చూడాలి," అంటూ జానకయ్య లేచాడు.

"వచ్చే నెల మా అమ్మాయి పెళ్ళి, మీ ఇంటిల్లపాదీ తప్పకుండా రావాలి," అంటూ, అన్నదమ్ములిద్దరూ జానకయ్యకు వీడ్కోలు చెప్పారు.



రామాపురం అనే గ్రామంలో సూర్యం అనే యువకుడుండేవాడు. వాడికి ఇరవై ఏళ్ళ వయసువచ్చినా, ఎలాంటి పనీ నేర్చుకోక తిని తిరుగుతూండేవాడు. వాడికి తండ్రీ, అనారోగ్యంతో బాధపడే తల్లీ, పెళ్ళీడు వచ్చిన  చెల్లెలు వుండేవారు.

ఇలా వుండగా, సూర్యం తండ్రి ఏదో వ్యాధికి గురై మరణించాడు. తండ్రి మిగిల్చిపోయిన కొద్దిపాటి డబ్బుతో  రెండు మాసాలు గడిచినై.

రోజూ అన్నం వడ్డిస్తూ, వాడి తల్లి, "ఎక్కడైనా చెల్లెలికి సంబంధం చూడు, బాబూ! ఇక

నేను ఆట్టేకాలం బతికేలా లేను," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకునేది.

ఈ బరువు బాధ్యతలు మోయడం అసాధ్యం అనిపించి, వాడొకనాటి రాత్రి జీవితం మీద విరక్తితో ఇల్లు వదిలి, అడవిలోకి పోయాడు.

సూర్యం అడవిలో తల వంచుకుని నడుస్తూండగా, "ఎవరా వెళ్ళేది? ఇటురా! చూడబోతే తీరని కష్టాల్లో వున్నట్టు కనబడుతున్నావు," అన్న మాటలు వినిపించినై.

ఆ మాట్లాడింది, దాపులనున్న గుట్టమీద కూర్చున్న, ఒక ఆడపిశాచం. సూర్యం భయపడక, గుట్ట మీదికి పోయి, తన పరిస్థితి అంతా దానికి చెప్పుకున్నాడు.

అది విన్న పిశాచం కొంచెం సేపు వెక్కి వెక్కి ఏడ్చి, "ఇన్ని కష్టాల మధ్య నువ్వింకా బతికి వుండడం ఎంత ఆశ్చర్యం!" అన్నది.

"అవును. ఏం చేయమంటావో చెప్పు!" అని అడిగాడు సూర్యం.

"నీ అదృష్యం కొద్దీ, ఇక్కడికి దగ్గర్లో వున్న వల్లకాట్లో, ఒక పాడుపడిన బావి వున్నది. వేగిరం పోయి అందులో దూకుదువుగాని పద" అంటూ పిశాచం, సూర్యాన్ని బయలుదేరతీసింది.

సూర్యానికి, పిశాచం సలహా సబబుగానే తోచింది. వాడు పిశాచంతో, ఆ పాడుబడిన బావి దగ్గిరకు వెళ్ళి, అందులో దూకబోయాడు.

"ఎవరు వాళ్ళు? ఇంత అర్ధరాత్రి వేళ, యిక్కడేం పని?" అంటూ ఒక ముసలి పిశాచం పైకి వచ్చింది.

సూర్యం, దానికి తన కథ అంతా చెప్పుకున్నాడు.

"పాపం, తల మునకలయ్యే కష్టాల్లో వున్నవాడు, వింటూంటే, నా గుండె తరుక్కుపోయింది. నావంతు సహాయం చేయడానికి, యిక్కడికి తీసుకువచ్చాను" అన్నది ఆడపిశాచి గర్వంగా.

"అఘోరించావుగానీ. యిక వచ్చిన దారిన వెళ్ళు" అని ముసలి పిశాచం, ఆడపిశాచాన్ని చీవాట్లు పెట్టి పంపేసింది.

"పాపం, దాన్నేమీ అనకు. నా సమస్యకు చక్కని పరిష్కారం చూపిన ఘనత దానిదే!" అన్నాడు సూర్యం.

ముసలిపిశాచం తల వూపి, "సరే, నిన్నొకచోటుకు తీసుకుపోతాను. అక్కడ జరిగేదంతా, చూడు. ఆ తర్వాత, నువ్వే గంగలో దూకుతావో, అదంతా నీ యిష్టం," అని, సూర్యాన్ని వల్లకాటిలో మరొక ప్రాంతానికి తీసుకుపోయింది.

అక్కడ ఒక శిథిలమైపోయిన సమాధి ముందు, కొన్ని పిశాచాలు కూర్చుని వున్నవి. ముసలిపిశాచం, సూర్యాన్ని ఒక ముళ్ళపొద వెనక దాక్కోమని చెప్పి, తాను పోయి గుంపుకట్టిన పిశాచాల పక్కన కూర్చున్నది.

కొంతసేపటికి, పెద్ద అట్టహాసంగా, ఆ పిశాచాల నాయకుడు వచ్చి, శిథిలమై పోయిన సమాధిమీద కూర్చున్నాడు. పిశాచాలన్నీ సంతోషంగా చప్పట్లు చరిచాయి.

పిశాచాల నాయకుడు, ఒకసారి గొంతు సవరించుకుని, "సహచరోత్తములారా! జాగేలా? ఈ నెల రోజుల్లో, మీరు సేకరించిన అద్భుతవస్తువులు ప్రదర్శించండి. ఒక సంగతి జ్ఞాపకం వుంచుకోండి. సంవత్సరాంతంలో, అత్యుత్తమ అద్భుత వస్తువు సేకరించినవారికి గొప్ప బహూమానం యివ్వబడుతుంది." అన్నాడు.

ఆ వెంటనే, ఒక పిశాచి ఖాళీబుట్ట నొకదాన్ని సమాధి మీద బోర్లించి, "కాయలు! కూరగాయలు!" అంటూ బుట్ట మీద బెత్తంతో మూడుసార్లు చరిచింది.

తర్వాత బుట్టను ఎత్తగానే, దాని కింద రకరకాల కూరగాయలు పోగుపడి వున్నవి.

"భేష్! భేష్!" అంటూ మిగతా పిశాచాలన్నీ చప్పట్లు చరిచాయి.

అది చూసిన సూర్యానికి, ఆ బుట్ట తన దగ్గిర వుంటే, తన కెదురైన సమస్యలన్నీ తీరిపోయినట్టే అనిపించింది.

మరొక పిశాచి, గుండిగ నొకదానిని సమాధి మీద బోర్లించి, "వండు, వండు! వంట వండు!" అంటూ బెత్తంతో దాని మీగ మూడుసార్లు కొట్టింది. తర్వాత గుండిగ ఎత్తగానే, దాని కింద ఘుమఘుమ లాడుతూ ఎన్నో పిండివంటలు!

బుట్టకన్న, గుండిగ లాభసాటిగా తోచింది, సూర్యానికి.

ఇంకొక పిశాచం, ఒక కుండను సమాధి మీద పెట్టి, "కావాలి, కావాలి, పాలు!" అంటూ బెత్తాన్ని కుండ చుట్టూ తిప్పింది.

కుండనిండా చిక్కటిపాలు! గుండిగ కన్న, కుండతో మరింత ధనం సంపాయించవచ్చనుకున్నాడు, సూర్యం.

పిశాచాల నాయకుడు లేచి, "నా అనుచరుల్లో, ఇంతటి ఘనులున్నారని తెలిసి గుండె పొంగిపోతున్నది. మళ్ళీ అమావాస్యనాడు సమావేశమవుదాం. లోగడ దాచినవాటి దగ్గిరే ఈ మూడు అద్భుతవస్తువుల్నీ దాచిపెడదాం," అంటూ వాటిని తీసుకుని, పక్కనేవున్న మర్రిచెట్టు తొర్రలో పెట్టాడు.

పిశాచాలన్నీ కోలాహలంగా, అక్కడినుంచి వెళ్ళిపోయాయి. సూర్యం మర్రిచెట్టు దగ్గిరకుపోయి, దాని తొర్రలోంచి కుండను బయటికి తీశాడు. దాని కింద వాడికి గుండిగ కనిపించింది. దాన్ని బయటికి తీశాడు. తర్వాత బుట్టనూ, దాని అడుగున వున్న పిల్లనగ్రోవినీ, చెప్పులనూ, చేటనూ, బెత్తాన్నీ, గంటనూ బయటికి తీశాడు. వాటన్నిటినీ ఎలా తీసుకుపోవడమా అని, వాడాలోచిస్తూండగా, తొర్ర అడుగున ఒక గోనె సంచి కనిపించింది.

సూర్యం ఆత్రంగా దాన్ని పైకితీసి, అద్భుత వస్తువులన్నిటినీ అందులో వేశాడు. తర్వాత

అక్కడ దొరికిన, ఒక తీగతో గోనె మూతిని బిగించి కట్టి, దాన్ని భుజానికి ఎత్తుకోబోయి, తెల్లబోయాడు.

అద్భుతవస్తువులతో నిండిన ఆ గోనె కాస్తా, అదృశ్యమైపోయింది. గోనెకూడా అద్భుతవస్తువన్న సంగతి అప్పుడు అర్థం అయ్యింది సూర్యానికి. సూర్యం పిచ్చివాడిలా దిక్కులు పరికిస్తూండగా, ముసలిపిశాచం అక్కడికి వచ్చి, "జరిగినదంతా చూశాను! నేను పాడుబడిన బావి దగ్గిర, నిన్ను చూసినప్పుడు నిరాశా పిశాచం నిన్ను ఆవహించి వున్నది. నీలో ఆశ అనే కొత్త ఊపిరిపోసి, నీచేత ఆత్మహత్యా ప్రయత్నం మాన్పించడానికి – నిన్ను యిక్కడికి తీసుకువచ్చాను. అయితే, యిక్కడ నిన్ను నిరాశాపిశాచం వదిలినా, అత్యాశ అనే పిశాచం పట్టుకున్నది. అందువల్లనే, అన్ని అద్భుతవస్తువుల్నీ సొంతం చేసుకోవాలన్న ఆరాటంలో, ఏ ఒక్కదాన్నీ, నీదిగా చేసుకోలేక పోయావు!" అన్నది.

"అవును, నిజమే! మరి యిప్పుడు నేనేం చేయాలి?" అని అడిగాడు సూర్యం.

"మనిషి పట్టుదలవహిస్తే, ఎన్ని అద్భుతాలైనా చేయగలడు. నువ్వు కూరగాయలు పండించలేవా? పిండివంటల వ్యాపారం చెయ్యలేవా? ఇన్ని గేదెలను పెట్టుకుని, వాటి పాలు అమ్మి కుటుంబాన్ని పోషించలేవా? ఆలోచిస్తే, బతకడానికి ఎన్ని మంచి మార్గాలు లేవు!" అని ముసలి పిశాచం అదృశ్యమైంది.

ఆ మాటల్లోని సత్యాన్ని గ్రహించిన సూర్యం, కొత్త ఉత్సాహంతో ఇంటి కేసి బయలుదేరాడు.

# * కానుక *



ఒక ఊళ్ళో ఒక వేటగాడు ఉండేవాడు. అతను మామూలు వేటగాడు కాదు: అరణ్యంలో ఉండే క్రూరమృగాలను ప్రాణాలతో పట్టి, బోనులలో పెట్టి తెచ్చి, వాటిని కొనే రాజులకూ, మృగశాలలకూ అమ్మి చాలా డబ్బు సంపాదించేవాడు.

ఒకనాడు ఆ వేటగాడి దగ్గిరికి ఒక పదిహేనేళ్ళ కుర్రవాడు, వచ్చి, "ఈ ఊళ్ళో ఒకావిడ ఉన్నది. ప్రతి శుక్రవారమూ ఆవిడకు పూనకం వస్తుంది. అప్పుడావిడ మీదకు కాళీమాత వచ్చి పలుకుతుంది. ఆ రోజు ఆవిడ వద్దకు ఎక్కడెక్కడి నుంచో భక్తులు వచ్చి, కానుకలు ఇచ్చుకుంటారు. ఇదంతా ఒక పెద్ద మోసం. దీన్ని బయట పెట్టడానికి నువు ఒక పనిచెయ్యాలి."

అన్నాడు.

"ఏం చెయ్యమన్నావు?" అని వేటగాడు అడిగాడు.

కుర్రవాడు తన ఆలోచన వేటగాడికి చెప్పాడు.

మరుసటి శుక్రవారం వేటగాడు అలివేలు అనే ఆవిడ ఇంటికి వెళ్ళాడు. అలివేలు పూనకం మీద ఉన్నది. ఆమె చుట్టూ అనేకమంది భక్తులున్నారు. వాళ్ళు తెచ్చిన కానుకలు కళ్ళుచెదిరేలా ఒక పక్క పెట్టి ఉన్నాయి.

వేటగాడు అలివేలు కాళ్ళ మీద పడి "మన్నించు, తల్లీ, ఇంతకాలమూ నిను నమ్మకుండా ఎంతో పాపం చేసుకున్నాను. నిన్ను ప్రత్యక్షంగా చూశాక నా కళ్ళు తెరుచుకున్నాయి. వచ్చే శుక్రవారం నీకు తగిన గొప్పకానుక – ఏ భక్తుడూ ఇచ్చుకోలేనిది – తెచ్చి ఇస్తాను. స్వీకరించి నన్ను అనుగ్రహించాలి, మాతా!" అన్నాడు.

కాళీమాత పూని ఉన్న అలివేలు ఆ కొత్త భక్తుణ్ణి ఆశీర్వదించింది.

వేటగాడు వెళ్ళిపోయాక భక్తులలో కుతూహలం బయలుదేరింది. ఈ కొత్త భక్తుడు ఎవరు? ఎవరూ ఇయ్యని కానుక వాడు ఏమిటి ఇస్తాడు? కుతూహలం కొద్దీ మరుసటి శుక్రవారంనాటికి అలివేలు ఇంటికి భక్తులు మామూలుకన్న కూడా చాలా హెచ్చు సంఖ్యలో వచ్చారు.

కొత్త భక్తుడు ఎంతకీ రాలేదు. వేళ మించిపోతున్నది. భక్తులకు ప్రసాదం పెట్టి పంపించే సమయం దాటిపోయింది. అలివేలు మీద కాళీమాత మరింత బలంగా పూని, మోసం చేసిన ఆభక్తుణ్ణి శాపనార్థాలు పెట్టసాగింది. అంతలో వేటగాడు వచ్చాడు. అతని చేతిలో కానుక ఏదీలేదు.

"కానుక ఏదిరా, భక్తా? నా తోనే పరాచికాలాడతావురా, మూఢుడా?" అని అలివేలు గర్జించింది.

"కానుక బయట ఉన్నది. చూతువు రా, తల్లీ!" అన్నాడు వేటగాడు.

అలివేలుతో బాటు భక్తులంతా బయటికి వచ్చారు. బయట ఒక బోనూ, అందులో అటూ, ఇటూ తిరుగుతూ ఒక పెద్దపులీ కనిపించాయి.

"తల్లీ, ఇదుగో నీ వాహనం! ఈ భక్తుడి ఈ చిన్నకానుక స్వీకరిచి, ఇక నువు నీ వాహనం మీద తిరుగు! " అంటూ వేటగాడు బోను తలుపు తీయబోయాడు. భక్తులు వణికిపోయారు. పులి గాండ్రుమన్నది. అలివేలు కెవ్వున అరిచి, "వద్దు, వద్దు! తలుపు తీయకు!" అంటూ కంపించిపోయింది.

"అలా బెదురుతావేం, మాతా? నీ వాహనాన్ని ఎక్కి మా భక్తుల కళ్ళు పావనంచెయ్యి," అంటూ వేటగాడు పులి బోను తలుపు మరొకసారి తెరవబోయాడు.

అలివేలు లోపలికి పారిపోబోయింది. వేటగాడు ఆమె దారికి అడ్డం నిలబడి, "ఇంక ఈ నాటకం ఆపు. నువ్వు కాళీ మాతవైతే పులి మీద ఎక్కు; కాకపోతే, ఇన్నాళ్ళూ ఇంతమందినీ మోసంచేశానని ఒప్పుకో. అప్పుడు నిన్ను పులి మింగినా పాపంలేదు," అన్నాడు.

అలివేలు జవాబు చెప్పక, బెదురు కళ్ళతో దిక్కులు చూస్తుంటే భక్తులు నిజం తెలుసుకున్నారు. అలివేలు భర్త ఏదో సర్దిచెప్పబోతే వాళ్లు అతన్ని అవతలికి ఈడ్చేశారు.

"నన్ను ఆ పులివాత వెయ్యకు! నేను లోకాన్ని ఇంతకాలమూ మోసగించినమాట నిజమే!" అంటూ అలివేలు ఏడ్చింది.

భక్తులందరూ కసికొద్దీ అలివేలును నానా మాటలూ అన్నారు. ఆమె భర్త భక్తులకానుకలు భక్తులకు తిరిగి ఇచ్చేశాడు. వేటగాడు పులిబోనును తోసుకుంటూ వెళ్ళిపోయాడు. అతను ఇంటికి చేరేసరికి ఆ పదిహేనేళ్ళ కుర్రవాడు అక్కడే ఉండి, ఏం జరిగిందని అడిగాడు.

"నువ్వు చెప్పినట్టే జరిగింది. ఆ మనిషి మోసం ఒప్పుకున్నది. కాని, లోకంలో ఎంతోమంది బతుకుతెరువు కోసం ఎన్నో మోసాలు చేస్తారు. నువ్వు పనిపెట్టుకుని ఆ మనిషి నోటిముందు కూడు ఎందుకు చెడగొట్టావు? ఆమె మీద నీ కెందుకు పగ? అని వేటగాడు కుర్రాణ్ణి అడిగాడు.

"ఆమె మీద నాకు పగలేదు. ఆమె మా అమ్మ. ఆవిడను ఈ మోసంలోకి దింపినది మా నాన్న. ఆయన వట్టి సోమరి. చేస్తున్న ఉద్యోగం మానటానికి మా అమ్మను అడ్డం పెట్టుకున్నాడు. నాకు ప్రపంచజ్ఞానం తెలుస్తున్నది. మా అమ్మా, నాన్నా ఆడే నాటకం ఎప్పటికైనా బయట పడకపోదు. నేను ఎలా తల ఎత్తుకు తిరగాలి? నీ దయ వల్ల అది వెంటనే జరిగింది. నేను నా కాళ్ళ మీద నిలబడే నాటికి ఈ కథ ఎవరికీ గుర్తుండదు. నీ శ్రమకు ప్రతిఫలంగా ఈ డబ్బు పుచ్చుకో," అంటూ అలివేలు కొడుకు వేటగాడికి డబ్బు ఇయ్యబోయాడు.

"మంచి పుణ్యకార్యం నా చేత చేయించావు. డబ్బు పుచ్చుకోకూడదు." అంటూ వేటగాడు ఆ కుర్రవాణ్ణి వీధి చివరదాకా సాగనంపాడు.

# * పదహారణాల స్నేహం *



అత్తవారింటికి కొత్తగా కాపరాని కొచ్చిన అమల, ఇల్లంతా ఒకసారి తిరిగి చూసి, తన అదృష్టాన్ని తానే నమ్మలేకపోయింది. లంకంత ఇల్లు, ఇంటి నిండా నౌకర్లు – యీ జరిగినదంతా ఆమెకు ఒక కలలా తోచింది.

దాదాపు మూడు నెలల క్రితం ఆమె ఒకనాటి సాయంత్రం ఏటి నుంచి నీటిబిందెతో యింటికి తిరిగి వస్తున్నది. దారిలో ఒక అందమైన యువకుడు ఎదురుపడి, ఆమె కేసి ఒకటి, రెండు క్షణాలు పరీక్షగా చూసి, "మరేం అనుకోకు. నా పేరు సుదర్శనం. నీ పేరేమిటి? ఇల్లెక్కడ?" అని అడిగాడు.

అపరిచితుడు యిలా పలకరించేసరికి అమల బెదరిపోతూనే, అతడి ప్రశ్నలకు జవాబు చెప్పి, గబగబా ఇంటికి వెళ్లి పోయింది.

ఆ తరవాత పది రోజులకు సుదర్శనం తల్లిని వెంట బెట్టుకుని అమల వాళ్ళ ఇంటికి వచ్చాడు. అసలు విషయం ఆమెకు అప్పుడు తెలిసింది. లోగడ సుదర్శనం ఆమెను ఏటి దగ్గిర పలకరించిన రోజున, తల్లితండ్రులతో కలిసి ఆ గ్రామంలో ఒక అమ్మాయిని చూడవచ్చాడు.

ఆ అమ్మాయి తండ్రి, సుదర్శనం తండ్రికి మంచి స్నేహితుడు.

అతిగా అలంకరించుకుని దురుసుగా ఎబ్బెట్టుగా మాట్లాడిన ఆ అమ్మాయి సుదర్శనానికి నచ్చలేదు. తండ్రి కోపగించుకొని ముందుగా బయలుదేరి తమ ఊరు వెళ్లిపోయాడు. కొంచెం వెనగ్గా ప్రయాణమైన సుదర్శనానికి, ఏటి నుంచి నీరు తెస్తున్న అమల దారిలో తారసపడింది.

అమల సవతి తల్లి, అమల అదృష్టానికి చాలా బాధ పడిపోయింది. అయితే, యిరుగూ పొరుగు వాళ్ళ వల్ల నానా మాటలూ అనిపించుకోవలసి వస్తుందని, యీ పెళ్ళికి ఒప్పుకున్నది.

అమల అత్తవారింటికి వస్తూనే, యీ పెళ్ళి తన మామగారికి ఏమాత్రం యిష్టం లేదని తెలుసుకున్నది. ఆయనకు కట్నం గురించి చింతలేదు; కొడుకు, తన స్నేహితుడి కూతుర్ని కాదన్నాడన్నదే బాధ!

ఆమె ఒకనాడు భర్తతో, "నాకు స్నేహితుడంటూ వున్న ఒక్కరూ, యీ ఊళ్లోనే వున్నారు. ఆయన్నొకసారి చూడాలి. ఇది, ఎన్నేళ్ళుగానో మనసులో వున్న కోరిక," అన్నది.

సుదర్శనం ఆశ్చర్యపోతూ, "నీకు యీ ఊళ్ళో స్నేహితుడా! ఎవరాయన?" అని అడిగాడు.

"అంత ఆశ్చర్యపోకండి. ఆ స్నేహితుడి కథ యిది," అంటూ అమల జరిగినదంతా చెప్పింది.

అమల పుట్టగానే తల్లి పోయింది. తండ్రి మరొక పెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లి అమలను రాచి రంపాన పెట్టేది. పదేళ్ళు కూడా నిండని అమల చేత ఇంటి చాకిరీ అంతా చేయించేది. బడికి వెళ్ళనిచ్చేది కాదు.

ఇలా వుండగా, సవతి తల్లి తమ్ముడి పెళ్ళి నిశ్చయమైంది. ఆమె పది రోజులు ముందుగానే పెళ్ళికి ప్రయాణమైపోతూ, ఇంటి గదులు అన్నీ తాళం పెట్టి, ముందు గదిలో కుంపటీ, సంచీలో కొంత బియ్యం అమల కోసం వుంచింది.

"నేను పది రోజుల్లో తిరిగొస్తాను. నే నిచ్చే, యీ ఇరవై అణాలతో మజ్జిగా, ఆకుకూరలూ కొనుక్కొని, మహారాణిలా వండుకు తిను," అంటూ ఆమె అమల చేతిలో ఇరవై అణాలు పెట్టి, పిల్లలూ, భర్తతో వెళ్ళిపోయింది.

అమల తండ్రి రెండో భార్య చేతిలో కీలుబొమ్మ.

అమల రెండు పూటలకు సరిపడ వంట చేసుకుని, పగలు భోజనం కాగానే కిటికీ ముందు కూర్చుని, వీధిలోకి చూస్తూ కాలం గడిపేది. ఇలా ఒంటరిగా వుండడం ఆమెకు బెంగ పుట్టించేది.

ఒకనాటి మధ్యాహ్నం వేళ, ఒంటి మీద కట్టుపంచ మాత్రమే వున్న ఒకాయన, వీధిలో నిలబడి, దారినపోయే వాళ్లకేసి చేతులు చాచి, "గ్రహణం అని సముద్ర స్నానానికి వచ్చాను. బట్టలు ఒడ్డున పెట్టి, స్నానం చేస్తూండగా, వాటిని ఎవరో ఎత్తుకుపోయారు. మా ఊరు వెళ్ళేందుకు బాడుగ బండిలో రేవు చేరి, అక్కడ పడవ ఎక్కాలి. ఇందుకు మొత్తం పదహారణాలు అవసరం. సాయం చేస్తే, ఆ డబ్బు మా నౌకరు చేత వెంటనే పంపుతాను, " అని దీనంగా అడగసాగాడు.

కాని, ఎవరూ అతడికి సాయం చెయ్యలేదు. తల పక్కకు తిప్పుకుని వెళ్ళిపోసాగారు. ఇది చూసి అమలకు చాలా జాలి కలిగింది. ఆమె గుమ్మం దాకా వెళ్ళి, అతణ్ణి కేకవేసి పిలిచి, దగ్గరకు రాగానే, "పదహారణాల మాట సరే, భోజనం చేశావా?" అని అడిగింది.

"ముందు మా ఊరు వెళ్ళిపోవాలి, పాపా! నీ పేరేమిటి?" అని అడిగాడతను.

అమల తన పేరు చెప్పి, "నేను పదహారణాలిస్తాను. ముందు భోజనం చెయ్యి," అని, రాత్రికని దాచిన అన్నంలో మజ్జిగ వేసి, అతడికి పెట్టింది.

అతను భోజనం చేసి రకరకాల కథలూ, కబుర్లూ చెప్పి అమలను బాగా నవ్వించాడు.

"ఇంతకూ, మీ ఊరేదో చెప్పావు కాదు," అన్నది అమల.

"నీ ఊరే! అమలాపురం," అంటూ నవ్వాడతను.

అతను పైన కప్పుకోవడానికి, తన తెల్ల పరికిణీ యిచ్చింది, అమల. చిరుగులు కనబడకుండా ఆ పరికిణీ కప్పుకుని అతను, "ఇదే ఆదితో, మా ఊరు నుంచి నీకు పట్టుపరికిణీ కుట్టించి పంపుతాను," అన్నాడు.

అమల యిచ్చిన పదహారణాలూ పుచ్చుకుంటున్నప్పుడు అతని చేతులు వణికాయి; కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"పాపా, ఒకవేళ, ఏనాడైనా మా ఊరు రావడం జరిగితే, మా ఇంటికి తప్పకుండా రా. ఈ వయసులో నీకు అర్థమౌతుందో లేదో గాని, కష్టంలో ఆదుకున్న వాళ్లే, నిజమైన స్నేహితులు. చిన్న కాయితం యిచ్చావంటే, నా చిరునామా రాస్తాను," అని అమల యిచ్చిన కాయితం మీద, తన ఊరూ, పేరూ రాసి యిచ్చి వెళ్ళిపోయాడు.

చదువురాని అమల ఆ కాయితాన్ని బట్టల అడుగున భద్రంగా దాచుకున్నది. రెండు రోజుల తరవాత ఒక మనిషి పట్టుపరికిణీ, వంద రూపాయలూ తెచ్చి, అమలకు యిచ్చి, "అమలాపురం వచ్చినప్పుడు, తమ ఇంటికి తప్పకుండా రమ్మని, బాబుగారు చెప్పమన్నారు" అన్నాడు.

ఆ వంద రూపాయల్లో పన్నెండణాలు ఖర్చయ్యేసరికి, అమల సవతితల్లి తిరిగి వచ్చేసింది. ఆమె సంగతి తెలుసుకుని, అమల దగ్గిర్నుంచి మిగిలిన డబ్బు తీసుకున్నది.

ఇది జరిగిన రెండు నెలలకు అమల తండ్రి హఠాత్తుగా జబ్బు చేసి చనిపోయాడు. సవతితల్లి పుట్టిల్లు దూరంగా వున్న ఒక పల్లె గ్రామం. వేరే దిక్కులేని అమల సవతితల్లి వెంట ఆ గ్రామం వెళ్ళిపోయింది.

భర్తకు అమల యిదంతా చెప్పి, "పెళ్ళి నిశ్చయానికి ముందు మీది అమలాపురం అని తెలిసి, నాకు చాలా సంతోషం కలిగింది. తండ్రి ప్రేమ ఎలా వుంటుందో ఆయనవల్ల తెలిసివచ్చింది," అన్నది.

"అంతా బాగానే వున్నది, మరి, ఆయన పేరూ, ఇల్లెక్కడో తెలియాలి కదా? నీకు చదువు రాకపోవడం ఎంత యిబ్బందో చూశావా. ఆ స్నేహితుడిచ్చి పోయిన కాయితం యిటు తీసుకురా," అన్నాడు సుదర్శనం.

అమల పెట్టె అడుగున పట్టుపరికిణీలో పెట్టి దాచిన కాయితం తీసి భర్తకిచ్చింది. సుదర్శనం అది చదివి, పెద్దగా చిటికె వేసి, "నీ చిన్ననాటి స్నేహితుడు, మరెవరో కాదు; మా నాన్నే!" అన్నాడు.

అమల నిర్ఘాంతపోయింది. వయసు పెరగడంతోపాటు ముఖంలో వచ్చిన మార్పులకు తోడుగా, తలంతా తెల్లబడి పోవడంతో ఆమె తన చిన్ననాటి స్నేహితుణ్ణి గుర్తించలేక పోయింది.

సుదర్శనం, తండ్రిని పిలిచి, కాగితం చూపించి, "దీన్ని గుర్తు పట్టగలవా, నాన్నా?" అని అడిగాడు.

సుదర్శనం తండ్రి ఆ కాయితాన్నీ, అమలనూ ఒకటికి రెండుసార్లు తేరి పార చూసి,

"అవును మరి, మాది అసలైన పదహారణాల *స్నేహం!" అన్నాడు సుదర్శనం తండ్రి నవ్వుతూ. "నువ్వు, ఆనాడు కష్టసమయంలో నన్ను ఆదుకున్న అమల వేనన్న మాట!" అంటూ సంతోషం కొద్దీ కళ్ళల్లో ఉబికే నీరును పై పంచెతో అద్దుకున్నాడు.

"మీ స్నేహబంధం మహా గట్టిది నాన్నా! పన్నెండేళ్ళ తర్వాత మిమ్మల్ని మళ్ళీ కలిపింది," అన్నాడు సుదర్శనం.

---

* పదహారణాలు = ఒక రూపాయి, పూర్తి స్నేహం అనడానికి పర్యాయపదంగా ఇలా వాడుతుంటారు.

# * పాడే పిశాచం-ఆడే పిశాచం *



చిదంబరానికి కంట్లో పూలు వేసి, చూపుపోయింది. నిత్యానందానికి పుట్టెడు చెముడు. ఇద్దరూ పెళ్ళిళ్ళు చేసుకుని, యాచకవృత్తితోనే పెళ్ళాలను పోషిస్తున్నారు.

వాళ్ళ ఊరుకు పదికోసుల దూరంలో రంగనాయకుల గుడి వున్నది. అక్కడ ప్రతి సంవత్సరం పెద్ద ఎత్తున స్వామివారి ఉత్సవాలు జరుగుతాయి. కొండకూ తమ ఊరికీ మధ్య వున్న చిట్టడివి దాటి చిదంబరం, నిత్యానందం ఆ కొండ మీద నాలుగు రోజులపాటు వుంటారు. గుడి మెట్లపక్కన గుడ్డపరచుకు కూర్చుంటే, సాయంకాలానికల్లా గుప్పెడు రూకలు మూటకట్టుకోవచ్చు.

ఆ ఏడు కూడా వాళ్ళిద్దరూ తిరునాళ్ళలో చెరో వంద సంపాయించుకుని, ఊరుకు తిరుగు

ప్రయాణమయ్యారు. అయితే, అప్పటికే బాగా చీకటిపడిపోవడంతో చిట్టడవిలో వాళ్ళ ప్రయాణం బాగా సాగలేదు.

"ఒరే, చిదంబరం! మనం కాస్త ముందుగా బయలుదేరవలసింది. దారిలో పాముపుట్రా - అర్ధరాత్రికయినా అడవి దాటకపోతే చాలా చిక్కుల్లో పడిపోతాం," అన్నాడు నిత్యానందం చుట్టూ వున్న కటిక చీకట్లోకి భయం, భయంగా చూస్తూ.

చిదంబరం అవునన్నట్టు తల వూపి, నిత్యానందం చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ వేగంగా నడవసాగారు. కొంత దూరం పోయాక హఠాత్తుగా ఒక చోట పెద్ద కోలాహలం రేగింది. చిదంబరం, నిత్యానందం చేతిని మరింత గట్టిగా వడిసిపట్టుకుని, "ఏమిటా గొడవ?" అని అడిగాడు.

ఆ సరికి నిత్యానందం ఆ కోలాహలానికి కారణమైన పిశాచాలను చూసి నిలువునా వణికిపోసాగాడు. ఒక మగ పిశాచి గొంతెత్తి భీకరంగా పాడుతూంటే, ఒక ఆడ పిశాచి దానికి తగ్గట్టు అడుగులు వేస్తూ, అడవి అదిరిపోయేలా నాట్యం చేస్తున్నది.

నిత్యానందం చెప్పగా సంగతి తెలుసుకున్న చిదంబరం తానూ వణికిపోతూ, "పొగడ్తకు పొంగిపోని ప్రాణి ఎక్కడుంటుంది? పిశాచాలే అవుగాక!" అన్నాడు.

తరవాత అతడు గట్టిగా చప్పట్లు చరిచి, "అద్భుతమైన పాట! కొబ్బరినీళ్ళలో కలకండ కలిపి తాగినట్టుగా వున్నది, " అన్నాడు.

ఆ పొగడ్తకు మగ పిశాచి పొంగిపోయింది.

నిత్యానందం తానూ చప్పట్లుచరిచి, "అమోఘమైన నాట్యం! నెమలికైనా నేర్వడం అసాధ్యం అనిపించేలా వున్నది," అన్నాడు.

ఆడ పిశాచికి ఆ పొగడ్త ఆనందాన్ని కలిగించింది. అయితే, తన పాటను నిత్యానందం మెచ్చుకోనందుకు కోపగించుకున్నది మగ పిశాచం. తన ఆటను చిదంబరం పొగడనందుకు ఆడపిశాచం ఉడుక్కున్నది.

అది చిదంబరాన్ని, "ఆయన పాట తప్ప, నా ఆట నిన్ను ఆకర్షించలేదా?" అని అడిగింది.

"నీ ఆట చూసి ఆనందించే అదృష్టం లేని గుడ్డివాణ్ణి. ఈ క్షణానే చచ్చిపోవాలనుకుంటున్నాను!" అన్నాడు చిదంబరం.

మగ పిశాచం నిత్యానందాన్ని, "ఆవిడగారి ఆట తప్ప, నా పాట నీకు ఆనందం కలిగించలేదా?" అడిగింది.

చెవిటివాడైన నిత్యానందానికి మగ పిశాచి అడిగిందేమిటో అర్థం కాలేదు. చిదంబరం కల్పించుకుని, "ఈ చెవిటి మాలోకానికి పాట పసందుగా వున్నదీ లేనిదీ, ఎలా తెలుస్తుంది!" అన్నాడు.

ఆ జవాబుతో పిశాచాలకు వాళ్ళల్లో ఒకడు గుడ్డివాడనీ, రెండవ వాడు చెవిటి వాడనీ తెలిసిపోయింది.

ఆడ పిశాచి చిదంబరం కళ్ళలోకి చల్లటి మంచులాంటి గాలిని ఊదింది. మగ పిశాచి నిత్యానందం చెవిలో గూబ అదిరి పోయేలా పొలికేక పెట్టింది.

ఆశ్చర్యం! మరుక్షణమే చిదంబరానికి కళ్ళు కనిపించసాగాయి; నిత్యానందానికి చెవులు వినిపిస్తున్నాయి. మళ్ళీ మగపిశాచి పాట అందుకున్నది. ఆడ పిశాచి ఆట ఆరంభించింది. కంపరం పుట్టిస్తున్న వాటి ఆటపాటల్ని మరి కొంతసేపు మెచ్చుకుని, యిద్దరూ సంతోషంగా ఊరిదారిపట్టారు.

వాళ్ళు ఊరు చేరేసరికి బాగా తెల్లవారి పోయింది. వాళ్ళ యిళ్ళు పక్క, పక్క వీధుల్లో వున్నవి. చిదంబరం కళ్ళు మూసుకు నడిస్తే తప్ప, తన వీధిలోని ఇంటిని గుర్తించలేకపోయాడు. అతడు తలుపు తట్టేసరికి చాలా అనాకారిగా వున్న స్త్రీ ఒకతె వచ్చి తలుపు తెరిచింది.

చిదంబరం ఆమెకేసి ఏవగింపుగా చూస్తూ, "చింతామణి అనే ఆవిడ యిల్లెక్కడ?" అని అడిగాడు.

చింతామణే అతడి భార్య పేరు. తలుపు తెరిచింది ఆవిడే!

భర్తకు చూపు వచ్చిన సంగతి తెలుసుకుని ఆమె పరమానందం చెంది, "నేనే చింతామణిని! నీకు కళ్ళు వచ్చాయనే ఆనందంలో, నా నోటమాట పెగలడం లేదు," అన్నది.

ఆ అనాకారి స్త్రీ తన భార్య అని నమ్మలేకపోయాడు చిదంబరం. అయితే, కంఠస్వరాన్ని బట్టి, ఆమె తన భార్య అని తెలుసుకున్నాడు. ఇంతకాలంగా ఆ వికారిమనిషితో తాను కాపురం చేసినందుకు అతడికి కంపరం పుట్టుకొచ్చింది. కాని, భార్య యీ శుభవార్త యిరుగు పొరుగులకు చెప్పేందుకు పరుగుతీసింది.

ఇక నిత్యానందం తన ఇల్లు చేరి, ఒకటికి, రెండుసార్లు తలుపు తట్టాక, "వస్తున్నా! వస్తున్నా!" అన్న కరుకైన 'మగ కంఠస్వరం లాంటిది వినిపించింది.

"ఏదో మగకంఠం వినబడుతున్నది. ఎవరు వచ్చారు?" అని అడిగాడు నిత్యానందం భార్యను.

భర్తకు చెవుడుపోయి, మాట వినబడుతున్నందుకు పొంగిపోయిన కాంతం,

"దేవుడి దయవల్ల నీకు చెవులు వినిపిస్తు న్నాయన్నమాట! నా గొంతుతీరే అంత," అన్నది.

ఆ కంఠస్వరం భరించలేని నిత్యానందం, "అలాగా! అయితే, అది తరచూ వినడం జరిగితే, నాకు మళ్ళీ చెముడు వస్తుంది. ఇక, నాముందు ఎన్నడూ పెదవి విప్పకు, జాగ్రత్త!" అన్నాడు.

అతడి భార్య గుడ్లనీరు కుక్కుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి అడవి దారిపట్టి పోతున్న నిత్యానందాన్ని, దారిలో చిదంబరం కలుసుకున్నాడు.

ఇద్దరూ ఒకరి కష్టాలొకరు చెప్పుకుని, పిశాచాలే తమ కష్టాలను తొలగించాలనుకున్నారు.

వాళ్ళు వెళ్ళేసరికి, యీసారి ఆడ పిశాచి పాడుతున్నది, మగపిశాచి ఆడుతున్నది. వాళ్ళను చూస్తూనే అవి ఆటా, పాటా కట్టిపెట్టి, "మళ్ళీ వచ్చారేం! సంగతేమిటి?" అని అడిగినై.

"నా భార్య పరమకురూపి! నేను కాపరం చెయ్యలేను. కంటి చూపు తెప్పించి, మీరే యీ గొడవకు కారణం అయ్యారు. పరిష్కారం మీరే చెయ్యాలి," అన్నాడు చిదంబరం.

"మగగొంతున్న ఆడమనిషి అన్ని అరిష్టాలకూ కారకురాలవుతుంది. నా భార్య గొంతు భరించలేను. మీరే ఏదైనా దారి చూపాలి." అన్నాడు నిత్యానందం.

పిశాచాలు తెల్లబోయి ముఖముఖాలు చూసుకుని, "ఇన్నాళ్ళూ, వాళ్లు మిమ్మల్ని ప్రేమగానే చూసుకుంటున్నారు గదా?" అని అడిగినై.

"అవును, యిప్పుడూ అలాగే చూస్తున్నారు. ఎటొచ్చీ వాళ్ళ రూపం, కంఠస్వరాలే చిరాకు కలిగిస్తున్నవి," అన్నారు చిదంబరం, నిత్యానందం.

"ఇంతకూ మీకున్న లోపాలను వాళ్ళేం పట్టించుకోకుండా, ఎంతో ఆదరంగా చూశారు. వాళ్ళ మనసులు ఎంత మంచివో ఆలోచించి చూడండి!" అన్నది మగపిశాచం.

ఆ మాట నిజం కావడంతో యిద్దరూ జవాబు చెప్పలేకపోయారు.

అప్పుడు మగపిశాచం, "శారీరకంగా వుండే లోపాలు సరిదిద్దుకోలేనివి. అవి వున్నవారిని అసహ్యించుకోవడం, క్షమించరాని నేరం. జీవితం అంతా కలిసి వుండవలసిన భార్యాభర్తల మధ్య వుండవలసింది ప్రేమా, ఒకరిపై ఒకరికి ఆదరణ. మీరు, మీ భార్యల అందచందాల్ని కాక, వాళ్ళ గుణగణాల్ని గౌరవించడం నేర్చుకోండి," అన్నది.

ఆ మాటలతో నిత్యానందానికి, ఆ క్షణం లోనే తన చెముడు పోయినట్టనిపించింది. చిదంబరం అప్పుడే తన గుడ్డితనం పోయినవాడిలా పిశాచాల కేసి ఆప్యాయంగా చూశాడు.

ఇద్దరూ పిశాచాలకు వంగి నమస్కరించి, "మాకు సరైన బుద్ధి చెప్పినందుకు, బతికున్నంతవరకూ మీకు కృతజ్ఞులం!" అని, అప్పటికప్పుడే ఇంటి దారి పట్టారు.

# * కళాభిమానం *



**భూ**పతి, పెదరెడ్డి గారింటి పాలేరు. రెడ్డిగారి ఇంటి వెనక ఉన్న పాకలో ఉండేవాడు. వాడిది చక్కని కంఠం; పదాలు పాడుకుంటూ పనిచేసేవాడు.

రెడ్డిగారి భార్య ఒకసారి వాడికి అన్నం పెట్టుతూ, "ఎన్నాళ్ళు ఇలా ఒంటరిగా ఉంటావురా? ఎక్కడన్నా మంచి  పిల్లను చూసి పెళ్ళి చేసుకో," అని సలహా ఇచ్చింది.

భూపతికి చాలా కాలంగా పెళ్లి ఆలోచన ఉన్నది, కాని పెళ్ళి ప్రయత్నాలు చేసే తీరిక లేదు. అందుచేత వాడు ఆమెతో, "అయ్యగారితో చెప్పి, ఒకవారంపాటు సెలవు ఇప్పించండి. పెళ్ళి చేసుకొస్తాను," అన్నాడు.

రెడ్డిగారు వాడికి సెలవు ఇచ్చాడు. భూపతి నాలుగు గ్రామాలు తిరిగి, చక్కని పిల్లను చూసి పెళ్ళాడి, తనవెంట తెచ్చాడు. ఆ పిల్ల పేరు చంద్రకళ. అంతా ఆమెను కళ అని పిలిచేవాళ్ళు.

కళకు పెద్ద పాండిత్యం లేకపోయినా, జానపద ధోరణిలో గేయాలు రాసే నేర్పు పుట్టుకతోనే వచ్చింది. ఎండలు కాసినా, వానలు కురిసినా, మేఘాలు ఉరిమినా, మెరిసినా, పెళ్ళిళ్ళు అయినా, పండగలు వచ్చినా కళ పాటలు రాసేది. ఆ పాటలు వినసొంపుగానూ, సున్నితమైన భావాలు కలిగీ ఉండేవి.

రెడ్డిగారి భార్యకు కళ అంటే చాలా అభిమానం. పై పెచ్చు కళ రాసే పాటలు వినటం ఆమెకు గొప్ప సరదా. కళ కూడా తాను ఏ పాట రాసినా ముందు రెడ్డిగారి భార్యకు వినిపించేది. కళ చాలా చక్కగా పాటలు రాస్తుందని ఆవిడే ప్రచారం చేసింది. కళకు అభిమానులు చుట్టుపట్ల చాలామంది ఏర్పడ్డారు. ఇది చూసి భూపతి స్నేహితుడొకడు అసూయతో కుమిలిపోయాడు. వాడి భార్యను గురించి చెప్పుకునేవాళ్ళు ఒక్కళ్ళయినా లేరు. అది ఒక అడవి జంతువు లాంటిది.

వాడు ఒకరోజు భూపతితో, "నీ పెళ్ళాం పాటలూ, పద్యాలూ రాస్తుందటగా? నువు డొక్క పొడిస్తే అక్షరం ముక్క లేని వాడివి కదా, నీ పెళ్ళాన్ని అలా గాలికి వదిలేస్తే నిన్ను మనిషి కింద చూస్తుందా? పాచిపని చేసుకుని బతకవలసిన మనిషి పాటలు వ్రాయటమూ, పదిమందికీ వినిపించటమూ – ఇదంతా పరువుమాలిన పని కాదుట్రా? కాస్త అదుపులో ఉంచి, పాటలూ పాడూ తగ్గించక పోయావో, త్వరలోనే నీ పెళ్ళాం నీ నెత్తికెక్కి కూర్చుంటుంది. తరవాత నీ యిష్టం!" అని హెచ్చరించాడు.

తన స్నేహితుడు తన మంచి కోరే ఆ మాట చెప్పాడనీ, అందులో చాలా నిజం ఉన్నదని భూపతికి తోచింది. వాడు ఇంటికి చేరేసరికి, కాకతాళీయంగా కళ ఏదో పాట రాస్తున్నది.

"ఎప్పుడూ ఆ పనికిమాలిన పిచ్చి రాతలు రాయకపోతే, నేను బయటిపని చూసి వచ్చేలోగా రెడ్డిగారి గేదెల పాలు పితకరాదా? పిడకలు చెయ్యరాదా? మనమేమన్నా పనీ పాటా లేకుండా కుడిచి కూర్చునేవాళ్ళమా? రెక్కాడితే గాని డొక్కాడదు మనకు!" అన్నాడు భూపతి, తన భార్యతో.

కళ వెంటనే లేచి వెళ్ళి, పాలు పితికి రెడ్డిగారి భార్య కిచ్చి, మర్నాడు పిడకలు కూడా తానే చేసింది.

అది మొదలు కళ పాటలు రాయటం మాని, రోజల్లా ఏదో పనిచేస్తూ గడపసాగింది. ఇలా చాలారోజులు గడిచింది. తన జీవితంలో పాటలు రాసుకునే అవకాశం పోయినందుకు ఆమె లోలోపల చాలా బాధపడింది, కాని ఆ బాధ ఎవరికీ చెప్పుకోలేదు.

ఒకరోజు భూపతి, రెడ్డిగారి తోటలో నీటిని మొక్కలకు మళ్ళిస్తూ గట్టిగా పాడుకుంటున్నాడు. సమీపంలోనే ఇద్దరు మనుషుల చేత కొబ్బరికాయలు దింపిస్తున్న రెడ్డిగారు భూపతితో, "నీ

నోరు క్షణం ఊరుకోదుట్రా? ఎందుకు అస్తమానమూ పిచ్చిపాటలు అంత గట్టిగా పాడతావు? నోరు మూసుకుని పని చేసుకోరాదు?" అని విసుక్కున్నాడు.

భూపతి మనస్సు చివుక్కుమన్నది. ఇంతవరకూ వాడి పాటను మెచ్చుకున్నవాళ్ళే గాని, దానికి వంకపెట్టినవాళ్ళు లేరు. వాడు నోరు మూసుకుని పని కొనసాగించాడు. కాని అంత దాకా ఉల్లాసంగా సాగిన పని ఇప్పుడు చాలా కష్టమనిపించసాగింది.

తరవాత రెండు మూడుసార్లు భూపతి పనిచేస్తూ తనకే తెలియకుండా పాడటమూ, రెడ్డిగారి చేత తిట్లు తినటమూ జరిగింది. వాడు పాడటమైతే మానాడు గాని, పనిచేసే శక్తి బాగా తగ్గిపోయింది.

రెడ్డిగారు వాడితో ఒకనాడు, "ఏం నువు వెనకటిలాగా పని చెయ్యటం లేదు, ఉద్యోగం మానుకుంటావా ఏం?" అని అడిగాడు.

"నన్ను పాడుకోవద్దంటిరిగా? పాడకుండా నాకు పని సాగదు. నన్ను పంపెయ్యండి. పాడుకుంటూ పని చేసేచోట కుదురుకుంటాను," అన్నాడు భూపతి.

రెడ్డిగారు నవ్వి, "మరి నీ పెళ్ళాం నీలాటి మనిషి కాదుట్రా? అది పని చెయ్యనన్నదా? దానిచేత పాటలు రాయటం ఎందుకు మాన్పించావు? కళాభిమానాన్ని అలా అణచిపెట్టితే నీలాగా బాధపడదూ? దాని బాధ నా భార్య గ్రహించి, నీకు కాస్త బుద్ధి చెప్పమన్నది అంతకన్న ఏమీలేదు. సంగతేమిటో అర్థమయ్యింది కదా? యిక వెళ్ళి పనిచూసుకో, పాడుకో. నీ భార్యను పనిచేసుకోవటంతో బాటు పాటలు కూడా రాసుకోనీ అన్నాడు.

# * ఇద్దరు మిత్రులు *



ఒక ఊళ్ళో రత్తయ్యా, రమణయ్యా అని ఇద్దరు మిత్రులు ఉండేవాళ్ళు, ఇద్దరికీ నా అనే వాళ్ళు ఎవరూ లేరు. ఇద్దరూ చిన్నతనం నుంచీ కలిసి కట్టుగా ఒకే కొంపలో ఉండేవారు. వాళ్ళకు ఒక పని అంటూ లేదు; బుద్ధి పుట్టినప్పుడు అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టితెచ్చి అమ్మి, దానితో కాలక్షేపం చేసేవారు; బద్ధకం పుట్టినప్పుడు ఎవరి దొడ్డి నుంచి అయినా, ఏ అరటిగెలో దొంగిలించుకుపోయి అమ్ముకునేవాళ్ళు.

రత్తయ్య అనే వాడి దగ్గిర వాడి తాతలనాటి సొట్టలుపడిన వెండి కంచం ఒకటి ఉన్నది.

రమణయ్య దగ్గిర ఒక పాతకాలపు నులకమంచం ఉన్నది. ఇద్దరూ ఆ వెండి కంచంలో

తిని, ఆ నులక మంచం మీద పడుకునేవాళ్ళు.

ఒక వానాకాలం రాత్రి జోరున వర్షం కురుస్తుండగా మిత్రులిద్దరూ వెండి కంచంలో భోజనం చేసి, మంచం మీద కూర్చున్నారు. రత్తయ్య వాటాలో కొంత అన్నం మిగిలిపోయింది. రమణయ్య వాటాలో కొద్దిగా కూర మిగిలింది. రేపు పొద్దున తినవచ్చునని దానిమీద ఆకు కప్పారు.

రత్తయ్య తమ దుస్థితికి చింతిస్తూ, "ఎంతకాలం మనం ఇలా జీవితం గడుపుతాం? రేపు మనం పెళ్ళిళ్ళు చేసుకుంటే పెళ్ళాలను ఎలా పోషిస్తాం?" అన్నాడు.

దానికి రమణయ్య "ఇలాంటి వర్షపు రాత్రి ఏ మహానుభావుడో తలుపు తట్టి, రాత్రికి తలదాచుకుని, ఆశ్రయం ఇచ్చిన వారికి ఎంతో మేలుచేసి పోయినట్టుగా ఎన్నో కథలు విన్నాం. కాని ఏ కారణం వల్లనో తెలియదు. మన దరిద్రకొంపకు మాత్రం ఏ మహానుభావుడూ రాడు," అన్నాడు విచారంగా.

"విచారించి ఏం లాభం? అర్ధరాత్రి కావస్తున్నది. పడుకుందాం," అన్నాడు రత్తయ్య.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు. రత్తయ్య లేచి వెళ్ళి తలుపు తీశాడు. బయట కాషాయవస్త్రాలు ధరించిన ఒక ముసలివాడు చలికి వణుకుతూ అతడికి కనిపించాడు.

రత్తయ్య వాడితో కోపంగా, "ఎవడి వయ్యా నువ్వూ? ఇంత రాత్రివేళ మీ తాత కట్టించిన ఇల్లు అన్నట్టు తలుపు బాదావు!" అన్నాడు.

"ముసలి సాధువును! ఆకలి దహించుకు పోతున్నది. ఈ పూట ఇక్కడ ఉండనియ్యండి," అన్నాడు సాధువు దీనంగా.

ఈ మాట వింటూనే రమణయ్య లేచి వచ్చి, "రండి, స్వామీ, మీ రాకతో మా యిల్లు పావనమయింది. కాని ఈ పూట అన్నంలోకి కూర మాత్రమే ఉన్నది," అంటూ ముసలివాణ్ణి లోనికి ఆహ్వానించాడు.

సాధువు వాత్సల్యపూర్వకంగా నవ్వి, "కాలే కడుపుకు మండే బూడిద చాలు, బిడ్డా! నీ మనసు దొడ్డది," అంటూ లోపలికి వచ్చి, రమణయ్య పెట్టిన అన్నమూ, కూరా తృప్తిగా తిన్నాడు.

తరవాత సాధువు రమణయ్యతో, "నా ప్రాణం నిలబెట్టావు, బిడ్డా, నీ వస్తువు ఏదైనా చూపించు, దానికి అద్భుతమైన శక్తిని ఇచ్చి నాదారిన నేను పోతాను," అన్నాడు.

"ఈ నులకమంచం నాదే, స్వామీ," అన్నాడు రమణయ్య.

సాధువు తన చేతుల తడి మంచం మీద విదిలించి, "ఫో, బిడ్డా! ఇక నీకు బెంగలేదు. నువు ఈనులక మంచం మీద పడుకుని, కాస్సేపు గట్టిగా కళ్ళు మూసుకున్నావంటే, ఎక్కడెక్కడి నిధి నిక్షేపాలూ నీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. సుఖపడు!" అన్నాడు రమణయ్యతో.

ఈ మాటలు వినగానే రత్తయ్యకు రమణయ్య మీద ఎక్కడలేని అసూయా పుట్టుకువచ్చింది.

వెంటనే వాడు "అన్యాయం, స్వామీ! మీరు తిన్నది నేను మిగిల్చిన అన్నం. వాడిది కూర మాత్రమే. అందుచేత మీరు అనుగ్రహించిన దాంట్లో మూడువంతులు నాకే రావాలి. అదీగాక, నులక మంచం నాది. వీడు దురాశతో అది తనది అంటున్నాడు," అని అబద్ధమాడాడు.

ఈ మాటకు రమణయ్యకు మండిపోయింది. ఇద్దరూ ఆ మంచం తనదంటే తనదని రెట్టించుకుని, చివరకు కలియబడ్డారు.

సాధువు వాళ్ళిద్దరినీ విడదీసి, "మీరు ఇలా పోట్లాడుకోవడం బాగులేదు, బిడ్డలారా! ఆ మంచం మీద ఇద్దరూ పడుకుని చూడండి. ఎవరి కళ్ళకు నే చెప్పిన నిధి నిక్షేపాలు కనిపిస్తే వారిదే ఆ మంచం," అన్నాడు.

మిత్రులిద్దరూ మంచం మీద పడుకుని, కళ్ళు గట్టిగా మూసుకున్నారు. ఎంతసేపటికి వాళ్ళకు ఏ నిధి నిక్షేపమూ కనబడలేదు. చివరికి ప్రాణం విసిగి వాళ్ళు, కూడబలుక్కున్నట్టుగా ఒకేసారి కళ్ళు తెరిచి చూసేసరికి సాధువు లేదు, వెండి కంచం కూడా లేదు!



ఒక ఊళ్ళో ఇద్దరు అన్నదమ్ములుండే వాళ్ళు. అన్న స్వార్థపరుడు, తమ్ముడు అమాయకుడు. తండ్రి పోగానే, అన్న – ఆస్తి అంతా తీసేసుకుని తమ్ముడికి ఏమీ లేకుండా చెయ్యాలని చూశాడు; కాని, నలుగురు పెద్ద మనుషులూ చివాట్లు పెట్టిన మీదట, తమ పెరట్లో ఉన్న గొడ్లపాకను తమ్ముడికి పంచి ఇచ్చాడు. అమాయకుడు కావటం చేత తమ్ముడు దానితోనే తృప్తిపడ్డాడు.

తమ్ముడు ఆ పనీ, ఈ పనీ చేసి తన పెళ్ళాన్నీ, పిల్లలనూ ఎలాగో పోషించుకుంటూ వస్తున్నాడు. అన్న మటుకు తనవద్ద ఉన్న డబ్బును వడ్డీకి తిప్పుతూ, తన పెళ్ళాంతో హాయిగా జీవిస్తున్నాడు.

తమ్ముడి సంపాదన ఏనాడూ అతని కుటుంబం అవసరాలకు సరిపోయేది కాదు. అందుచేత వారికి ఏ విషయంలోనూ సంతృప్తి అనేది ఉండేది కాదు. ఆ కారణంగా తమ్ముడు, అన్న వద్ద అప్పుడప్పుడూ అప్పు తీసుకునేవాడు. ఆ అప్పు ఎలాగూ తీరేది కాదు గనక, అప్పు కొంతదాకా పెరిగిన మీదట ఆ గొడ్లపాక కూడా స్వాధీనం చేసుకుని, అక్కడ మరొక ఇల్లు కట్టాలనే ఉద్దేశంలో ఉన్నాడు అన్న.

ఇలా ఉండగా తమ్ముడు అడవి దాటి ఒక ఊరు వెళ్ళవలసి వచ్చింది. అతను ఆ ఊరు వెళ్ళి తన పని చూసుకుని, వేకువజామునే బయలుదేరి తన ఊరు వస్తున్నాడు. సూర్యోదయం అయేసరికి అతను ఒక చిన్నకొలను దగ్గిరికి వచ్చాడు. ఆ కొలనులో ఒకే ఒక బంగారు రంగు కల తామర మొగ్గ ఉన్నది. తమ్ముడు చూస్తూ ఉండగానే ఆ మొగ్గ మీద సూర్య కిరణాలు పడ్డాయి. వెంటనే అది విచ్చుకున్నది.

అపూర్వమైన ఆ బంగారు తామర పుష్పాన్ని చూసి ముగ్ధుడై తమ్ముడు దాన్ని కోసేసుకున్నాడు. అదే క్షణంలో అక్కడ ఒక స్త్రీ ప్రత్యక్షమయింది. ఆమె దేవతా స్త్రీలాగా కనిపించేసరికి, తమ్ముడు ఆమెకు నమస్కరించాడు.

ఆ దేవతా స్త్రీ అతనితో, "ఈ కొలనులో రోజూ ఒకే ఒక పువ్వు పూస్తుంది. దాన్ని నేను నా పూజకు ఉపయోగించుకుంటాను. అందుచేత నువు కోసిన పుష్పాన్ని నా కిచ్చి, దానికి బదులుగా ఏదైనా వరం కోరుకో," అని చెప్పింది.

తమ్ముడు పశ్చాత్తాపంతో, "దేవీ, నేను తెలియక కొలనులో దిగి ఈ పుష్పాన్ని కోశాను. ఆ కారణంగా తప్పునాదే. ఈ భాగ్యానికి వరందేనికి? నీ పుష్పాన్ని నువు తీసుకో," అంటూ బంగారుకమలాన్ని ఆమె కిచ్చాడు.

"నువు చాలా మంచివాడివి, నీ మంచితనానికి మెచ్చి వరం ఇవ్వదలిచాను ఏదైనా కోరుకో," అన్నదామె.

తమ్ముడు కొంచెం ఆలోచించి, "దేవీ బీదరికం చేత మా ఇంటిల్లిపాదీ అసంతృప్తితో బతుకుతూ ఉన్నాం. మాకు ఏ నాటికీ అసంతృప్తి అనేది లేకుండా అనుగ్రహించు," అన్నాడు.

"చాలా తెలివిగా వరం కోరావు. ఏ వరం కోరినా మనిషి చివరకు కోరేది సంతృప్తే. మరొక వరం కోరినట్టయితే, ఇంకా మంచి వరం కోరకపోతినే అన్న అసంతృప్తి నీకు ఉండేదే," అని చెప్పి దేవతాస్త్రీ అదృశ్యమయింది.

తమ్ముడు సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చాడు. అది మొదలు అతని ఇంటి జీవితమే మారిపోయింది. అతను ఎంత తీసుకువచ్చినా అందరికీ సరిపోవటమే గాక కొంత మిగులుతున్నది. అతని ఇంటిలో ఏ విషయంలోను ఎవరికీ అసంతృప్తి అన్నది లేదు. అతను అన్న దగ్గిరికి అప్పు కోసం వెళ్ళకపోగా, చేసిన అప్పులు క్రమంగా తీర్చేశాడు.

తమ్ముడి సంసారం పచ్చగా ఉన్నట్లు కనబడేసరికి, వాళ్ళ కేదో నిధి దొరికి ఉంటుందనుకున్నాడు అన్న. తమ్ముడు బోళావాడు కనక అడిగితే చెప్పేస్తాడనుకుని వెళ్ళి, "ఏం, తమ్ముడూ అంతా కులాసాగా ఉంటున్నారా? నా అప్పంతా తీర్చేశావు. మళ్ళీ అప్పుకు అంటూ రాలేదు. ఏమిటి విశేషం? నా దగ్గిర దాపరికం దేనికీ?" అన్నాడు.

"ఏమీ లేదు, అన్నయ్యా. ఉన్నదాంతోనే నాకు జరుగుబాటు అవుతున్నది అంతే. నాకు నేను కష్టపడి సంపాయించేదాంట్లో కాస్తో కూస్తో మిగులుతున్నది కూడా. కొరత లేకుండా బతుకుతున్నాం." అన్నాడు తమ్ముడు.

అన్న నవ్వి, " నా దగ్గిర దాస్తున్నావు. ఏదో నిధి దొరికి ఉంటుంది. లేకపోతే, ఇంతకాలమూ లేని జరుగుబాటు ఇప్పుడెలా వచ్చిందీ?" అన్నాడు.

తమ్ముడు దాచకుండా అన్నతో, అడవిలో కొలను గురించీ, తామరపువ్వు గురించీ, దేవత గురించీ, ఆమె ఇచ్చిన వరం గురించీ, వివరంగా చెప్పాడు.

అంతా విని అన్న తమ్ముడితో ఏమీ అనకుండా, ఇంటికి వచ్చేసి, దేవతను ఏం వరం కోరాలో తెల్లవార్లూ ఆలోచించి తేల్చుకున్నాడు. అతను మర్నాడు ఉదయం సూర్యోదయం కాక పూర్వమే అడవిలో ఉన్న కొలను చేరుకున్నాడు. కొలనులో ఒకే ఒక బంగారు తామర మొగ్గ ఉన్నది. సూర్య కిరణాలు తనమీద పడగానే అది విచ్చుకున్నది. వెంటనే అన్న దాన్ని కోసేసి, తన రెండు చేతుల మధ్య గట్టిగా పట్టుకున్నాడు.

అంతలో వనదేవత రానే వచ్చింది. ఆమె అన్ననూ, అతను పువ్వుపట్టుకున్న వాలకాన్నీ చూసి, అతను కావాలనే ఆ పని చేశాడని గ్రహించి, "ఆ పువ్వు నాది, నా కిచ్చెయ్యి," అన్నది.

అన్న వెకిలిగా నవ్వి, "నాకు వరమిస్తే పువ్వు ఇస్తా, లేకపోతే ఇవ్వను," అన్నాడు. వనదేవత వాణ్ణి చూసి అసహ్యించుకుంటూ, "నీ కేం వరంకావాలి?" అని అడిగింది.

ముందే ఆలోచించి పెట్టుకున్న అన్న, "నేను అనుకున్న వెల్లా జరగాలి," అన్నాడు.

వనదేవత వాడికి అలాగే వరం ఇచ్చి, బంగారు కమలం తీసుకున్నది.

అన్న ఆనందానికి మేరలేదు. కొలను గట్టున ఉన్న మామిడి చెట్టునిండా పళ్ళుండాలి అనుకున్నాడు. అలాగే జరిగింది. వాడు తిన్నన్ని పళ్ళు తిని, ఇంటికి వెళ్ళి, తన ఇల్లు పెద్ద భవంతి కావాలనుకున్నాడు. అలాగే జరిగింది. వాళ్ళకిప్పుడు దేనికీ లోటు లేదు గనుక ఇంటిల్లిపాదీ పంచభక్ష్యపరమాన్నాలతో విందు ఆరగించారు.

ఆ సాయంకాలం అన్న భార్య తన తోటికోడలకీ, మరిదికీ తమ గొప్ప చెప్పుకోటానికి పాకకు వెళ్ళింది. ఆమె చీకటిపడ్డాక పాక నుంచి వస్తుండగా గదిలో పరధ్యానంగా కూర్చుని వున్న అన్న పెరట్లోకి తొంగి చూసేసరికి ఎవరో నల్లగా తమ ఇంటికి రావటం కనిపించింది.

"బాబోయ్, అది దయ్యమేమో! లోపలికి రాదుగదా?" అని అన్న భయపడ్డాడు.

వెంటనే అన్న భార్య దయ్యంగా మారి ఇంట్లో ప్రవేశించింది.
"ఈ దయ్యం నన్ను మింగేస్తుందేమో అని మళ్ళీ అనుకున్నాడు అన్న.
అంత పనీ జరిగింది. దయ్యం అన్నను మింగేసి ఎటో వెళ్ళిపోయింది.
అన్నకు పిల్లలు లేకపోవటం చేత అతని భవంతీ, మిగిలిన ఆస్తీ తమ్ముడికే సంక్రమించింది.

# నేనూ - నా కథ



21-5-1955న పుట్టిన నేను నా మొదటి కథ "గుడ్డివాడి డబ్బు"ను 1969లో రాశాను. అది ఆ సంవత్సరం సెప్టెంబర్, చందమామలో ప్రచురింపబడింది. ఆ కథకి ప్రేరణ - జైలు సూపరెంటెండెంట్‌గా రిటైరయిన మా నాన్నగారు కీ॥శే॥ సీతారామయ్య గారు. మా అమ్మ శ్రీమతి రత్నకుమారి గారి ప్రోత్సాహంతో నా 17వ ఏటనుండి విడవకుండా కథలు రాస్తున్నాను. ఇప్పటి వరకూ కేవలం "చందమామ" లోనే 150 కథల వరకూ అచ్చయ్యాయి!. ఇతర తెలుగు పత్రికల్లో 150 వరకూ ప్రచురింపబడ్డాయి. "ఆంధ్రభూమి" కథల పోటీలో నా "పిచ్చితల్లి" కథకి ద్వితీయ బహుమతి లభించింది. ఆం.ప్ర. బాలల అకాడమీ నిర్వహించిన జానపద నవలల పోటీలో నా "అడుగుకో ఆపద" నవలకి ప్రథమ బహుమతి లభించింది. నా "విధి నిర్వహణ" కథ మహారాష్ట్ర గవర్నమెంట్ వారి ఆరవ తరగతి, "తెలుగు భారతి" లో పాఠంగా ఉంది.

నన్ను కంటికి రెప్పలా చూసుకునే నా శ్రీమతి లక్ష్మీ కుమారి నేను రాసే ప్రతి కథకు ప్రథమ పాఠకురాలు. అమ్మాయి స్రవంతి, అబ్బాయి కార్తిక్ మా పిల్లలు. కెనరా బ్యాంక్‌లో మేనేజర్ ఉద్యోగం.

నాకు రచయితగా ప్రత్యేక గుర్తింపు ఇచ్చిన "చందమామ" కి నేను ఆజన్మాంతం ఋణపడి వుంటాను.

ఈ పుస్తకాన్ని అమితంగా ఆదరిస్తున్న అఖిలాంధ్ర పాఠకులకు, విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి నా కృతజ్ఞతలు.

- మాచిరాజు కామేశ్వరరావు



"పుస్తకాలు లేని ఇల్లు కిటికీలు లేని గదివంటిది. పుస్తకాలు కొనగల శక్తిగల వారు, వారి పిల్లలకు పనికొచ్చే పుస్తకాలను కొనిస్తే వారిని సక్రమంగా పోషించినట్లే" - మాన్